# క్షరాల్లో అనుభూతులు

## 4 వ భాగం









రచన :

॥ మోపిదేవి కృష్ణస్వామి M A., Ph.d

యూనివర్సల్ హ్యూమానిటేరియన్

ఎడ్యుకేషన్ ట్రస్టు

విశాఖపట్టణం

పుట

ప్రథమ ముద్రణ



వెల రు. 12-00



ప్రతులకు :
దీ యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టు
23-10-7, పురుషోత్తం వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ - 11.



ముఖచిత్రం : బాలి

ముద్రణ :
విక్టరీ ప్రెస్
అబ్దుల్‌ఖాదర్ వీధి
విజయవాడ - 1

# ఇందులో



పుట

403/4.90

# అక్షర నాదం : అనుభూతి వేదం !

సదాశివ సమారంభామ్
శంకరాచార్య మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యంతామ్
వందే గురు పరంపరామ్ ॥

గురుశిష్య పరంపర భారతీయ సంస్కృతీ వటవృక్షానికి మూల కందం. గ్రంథస్థ విద్యగా కాక, కంఠస్థ విద్యగా సకల పురాణేతిహాస శాస్త్రాలు ఈ గడ్డపై తరతరాలుగా వాక్ప్రవాహాలై సజీవాలై అంది వస్తున్నాయి. ఈ సత్సంప్రదాయానికి గురుకులాలు అక్షరారామాలు.

రాముడికి వశిష్ఠుడివలె, కృష్ణుడికి సాందీపనివలె, వివేకానందునికి రామకృష్ణ పరమహంసవలె ఈ గురుశిష్యసంప్రదాయము ఆదర్శవంతమైనది.

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" — అని శ్రీ కృష్ణ భగవానుడు భగవద్గీతలో ప్రతిజ్ఞాపూర్వకమైన ఆశంసన యిచ్చినట్లే భారత దేశంలో కేవల భౌతికవాదంపై వేద ఖడ్గప్రహారం చేసిన, చేస్తున్న ఎందరో మహనీయుల్ని మనం చూస్తున్నాం.

నాణానికి బొమ్మ — బొరుసువలె మానవ దేహానికి, మనిషి జీవితానికి ఆధ్యాత్మిక భౌతికస్థితులు, సాధనలు బొమ్మా-బొరుసు వంటివి.

ఈ సత్యాన్ని నిత్యజీవితంలో అర్థం చేసుకున్న వారు ద్వైధీ భావంలో పడరు. భౌతికమా? ఆధ్యాత్మికమా?– ఏది ముఖ్యం? ఏది

అనుసరణీయం? అన్న మీమాంసలోపడిన మనిషికి గురువే మార్గోపదేశం చేస్తాడు. సద్గురువు ఎప్పుడూ కృష్ణాంశుడే.

మాష్టరు ఎక్కిరాలకృష్ణమాచార్యులవారు అలాంటి కోవకే చెందిన ఒక గురువు. ఒక దేశికోత్తముడు.

భౌతిక ఆధ్యాత్మిక తత్త్వాల్ని సమపాళ్ళలో రంగరించుకొన్న వ్యక్తిత్వం, సాధక ఆయనది. సేవాధర్మం, తత్త్వబోధనం, యోగసాధనం – ఈ మూడు తత్త్వాల్ని ప్రాణ దీపాలుగా వెలిగించిన అక్షరతపస్వి ఆయన.

ఆయన జీవితం ఒక సందేశం. కొన్ని సందేశాలకి ఆచరణం ఆయన జీవితం. ఈ విషయాన్ని అక్షరబద్ధం చేశారు శ్రీ మోపిదేవి కృష్ణస్వామి.

రామపాదం సోకిన అహల్యవలె, కృష్ణహస్త స్పర్శనందిన కుబ్జవలె, సద్గురువు ఆశీర్వాదం శిష్యుణ్ణి చైతన్యవంతుణ్ణి చేస్తుంది. సాధనాపథ గామిని చేస్తుంది. మాష్టరు ఎక్కిరాల వారి సాన్నిధ్యం కృష్ణస్వామి గారిలో అంతర్నిహితంగా ఉన్న సాధన జ్యోతిని వెలిగించింది. మాష్టరు గారి సన్నిధిలో కృష్ణస్వామిగారు గ్రహించిన, దర్శించిన, అనుభూతికి తెచ్చుకున్న ఎన్నో అంశాలని యిప్పటికి మూడు భాగాలుగా అందించారు.

ఇది నాలుగవ భాగం. ఎక్కిరాల వారిని అత్యంత సన్నిహితంగా చూసిన ఆయా సంఘటనలలో, సందర్భాలలో ఆయన వ్యక్తిత్వ వైభవాన్ని గ్రహించిన అనుభూతికి ఇది కృష్ణస్వామిగారి అక్షరనైవేద్యం.

భారతీయ సంస్కృతిపట్ల, ప్రాచీన గ్రంథాలపట్ల నిరసనలు, కువ్యాఖ్యలు కోకొల్లలుగా వెలువడుతున్న అసురసంధ్యవేళ అక్షర కాంతులు వెదజల్లి సాధకులకు, జిజ్ఞాసువులకి సందేహనివృత్తి చేసే నేహాళి ఇది.

గురువు "అక్షరనాదం" చేస్తే శిష్యుడు దానిని "అనుభూతి వేదం"గా మార్చిన వాగర్థం ఇది.

అక్షరాలు మాష్టరు గారివి.
అనుభూతులు కృష్ణస్వామిగారివి.
అక్షరాల్లో అనుభూతులు మనందరివి :
అందుకోండి ! అక్షయానంద ఝురిని !

ఓం శాంతిః ! శాంతిః ! శాంతిః !!

25-4-1990 పురాణపండ రంగనాథ్.
విజయవాడ "సిరివెన్నెల"



# బొమ్మా - బొరుసూ

సాయంత్రం నాలుగు గంటలవుతోంది. అక్కయ్య పాలెంలోని మాష్టరు గారింట్లో మధ్యగదిలో నేను, మాష్టరుగారూ తీరుబడిగా కూర్చుని మామా పనితీరులనుగూర్చి పరామర్శించుకుంటున్నాం. అప్పుడు నేను అడిగాను. "మాష్టరుగారూ : మిమ్మల్ని గూర్చి నానుండి వెలువడుతున్న రచనలపైన మీ అభిప్రాయమేమిటి"? అని-

అందుకు చిరునవ్వు నవ్వి మాష్టరుగారు ఇలా అన్నారు. "నీవు అడిగిన అంశాన్ని గురించి, నాదగ్గర ఉన్నది అభిప్రాయంకాదు. అనుభూతి. అదేమిటంటే ఒకే నాణానికి నా రచనలు బొమ్మయితే, నీ రచనలు బొరుసు" అని. కేవలం నా రచనలే వస్తే అవి నేనేం చెపుతున్నానో మాత్రమే తెలియజేయగలుగుతాయి. వాటికి తోడుగా నన్ను గూర్చిన నీ రచనలు కూడా వస్తే నానుండి చెప్పబడుతున్నవి ఉన్నాయే, అవి నా జీవితంలో ఎలాంటి అన్వయాన్ని పొందుతున్నాయో, ఎలా అన్వయించుకో బడుతున్నాయో తెలియజెప్పినట్లవుతుంది. థియరీకి ప్రాక్టికల్ తోడయితే ఎలా ఉంటుంది? నా రచనలకు నీ రచనలు తోడయినపుడు అలా ఉంటుంది. చదువరి ఎవరైనా మన ఇద్దరి రచనలను కలిపి చదువుకున్నప్పుడే, తనకు కావలసిన సందేశాన్ని స్పష్టంగా సాక్షాత్కారింప జేసుకోగలుగుతారు. ఇది నా అనుభూతి. బాగుందా?

"బాగుంది ఇంకా చెప్పండి."

ఇంకా చెప్పాలంటావా? "ఇంకా చెప్పండి" అని నీ వన్న తరువాత నాకూ ఇంకా చెప్పాల్సిందేదో మిగిలి ఉన్నట్లుగా అనిపిస్తోంది. "నీవు నాకు దగ్గరగా ఉన్నావు. మనం కలిసి మెలిసి తిరుగుతున్నాం మనం దగ్గరై ఒక దశాబ్దం దాటుతోంది. నీవు పరిచయమైనప్పటికీ ఇప్పటికీ మన ప్రయాణం ఎన్నిమలుపులు తిరుగుతూ వచ్చిందో నీకు తెలుసు. మీరు పరిచయమయ్యే టప్పటికే నా దినచర్య నాకు తీరుబడి నివ్వని స్థితి ఉన్నప్పటికీ, వీలు చేసుకుని నేను మీతో కొంతసేపు ప్రత్యేకంగా గడు

పుతూ ఉండేవాడిని. సహజీవనంలోని ఆనందాన్ని అనుభవించటం కోసం మనం కొన్ని ప్రత్యేక కార్యక్రమాలూ, ప్రయాణాలూ కూడా రూపొందించుకునే వాళ్ళం గుర్తుందా! కానీ కార్యక్రమం పన్నా పెరుగుతూ రావడంతో రాను రాను మనకి మాట్లాడుకోవడానికే సమయం దొరుకుతుందా లేదా అన్న స్థితి వచ్చేసింది. నీలాగా సన్నిహితంగా పని చేస్తున్న ఏ కొద్దిమందికో తప్ప నేను దొరకని స్థితి ఏర్పడుతోంది. కార్యక్రమం దృష్ట్యా ఈ స్థితి తప్పదు. కానీ, మీ తర్వాత నాకు దగ్గరైన వాళ్ళూ, ఇకముందు నాకు దగ్గర కాబోయే వాళ్ళూ ఉన్నారే వాళ్ళతో నేను మీతో గడిపినట్లు గడపగలనా! అదిసాధ్యం కాదని తెలిపోతూనే ఉంది గదా! మరి, వాళ్ళకాలోటు ఎలా తీరుతుంది? ఇదిగో, నీ నుండి దిగి వస్తున్న ఈ రచనలే ఆ లోటును తీర్చగలిగేది. ఈ నీ రచనలు ఉన్నాయే ఇప్పటి వాళ్ళనే గాక, రాబోయే తరాల వాళ్ళను కూడా నాకు దగ్గర చేస్తాయి. ఈ 'నా' చెలిమిలోని మాధుర్యాన్ని తరతరాల వాళ్ళకు రుచి చూపిస్తాయి. వారిక నన్ను చూడలేదని గాని, నాతో గడప లేదని గాని బాధపడరు, బెంగపడరు. నీవు రచించే రచనలలోని వివిధ పాత్రలు వారై, నాతో నడుస్తూ, తమకు కావలసిన సాన్నిధ్యాన్ని, సందేశాన్ని, ఈ "నా" జీవితం నుండి అందుకుంటూనే ఉంటారు. కాలం గడుస్తున్న కొద్దీ ఈ రచనలు ఇతిహాస రూపాన్ని పొందుతాయి. కాలం గడుస్తున్న కొద్దీ ఇవి మరింతగా ప్రజలకు దగ్గరై, ఎనలేని ప్రయోజన పరమార్థాలను సాధిస్తాయి

నీవు నన్ను అనుకరించటం లేదు. అనుసరిస్తున్నావు. నీవు నేను చేస్తున్నది చేయటము లేదు. ఏది చేస్తే నేను చేస్తున్న దానికి సమగ్రత లభిస్తుందో దానిని చేస్తున్నావు. జరుగవలసింది అదే. అందుకే జరుగుతోంది. ఇక ఇది ఇలా జరుగుతూనే ఉంటుంది."

"అక్షరాల్లో అనుభూతులు" నాల్గవ భాగానికి ముందు మాట వ్రాద్దామని కూర్చునే టప్పటికి ఆనాడు జరిగిన ఈ సన్నివేశం కనుల

ముందు మరొక్కసారి సాక్షాత్కరించింది. గోచరించిన ఆ సన్నివేశాన్ని అక్షరబద్ధం చేసే ప్రయత్నం జరిగింది.

మనిషి, నిత్య జీవితాన్ని ఎలా నియమించుకోవాలో, ఎలా నిర్వహించుకోవాలో ఆ నిర్వహించుకోవడంలో ఎలాంటిమెలకువలను చూపాలో, ఎలాంటి అవగాహనను కలిగి ఉండాలో తెలియ జెబుతాయి, ఈ అక్షరాల్లో అనుభూతులు. నిత్య జీవితాన్ని నియమించుకోవాలి. నియమించుకోవడం ద్వారా దానిని పవిత్రీకరించుకోవాలి. పవిత్రీకరణ చెందుతున్న జవితాన్ని సద్వినియోగం చేయడం ఎలాగో నేర్చుకోవాలి. సద్వినియోగం చేయగలిగిన స్థితిలో ఈ జీవితాన్నే ఒక యజ్ఞంగా రూపొందించుకొని, లోక హితాన్ని ఎలా సాధించాలో నేర్చుకోవాలి. మనిషిని చేయి పట్టుకొని ఈ మెట్లన్నీ ఎక్కిస్తాయి ఈ అక్షరాల్లోఅనుభూతులు.

"అక్షరాల్లో అనుభూతులు" – మొదటి భాగంలో మనిషి తన జీవితాన్ని ఎలా నియమించుకోవాలో, తద్వారా ఎలా పవిత్రీకరించుకోవాలో చూపబడింది. రెండవ భాగంలో పవిత్రీకరణ చెందుతున్న జీవితాన్ని సద్వినియోగం చేయటానికి గాను, మనిషి ఎలాంటి మెలకువలను గ్రహించుకోవాలో ఉపదేశింప బడింది. మూడవ భాగంలో జీవితాన్ని సద్వినియోగం చేయగలిగిన మనిషికి అవకాశాలు ఎలా నడిచి వస్తాయో, ఆ నడచి వచ్చిన అవకాశాలు అతడిని ఎలా ముందుకు నడిపించుకొని వెళతాయో చూపబడింది అలా ముందుకు నడిపించబడుతున్న మనిషికి సమాజం యొక్క స్థితి గతుల యెడల, సృష్టిలోని వివిధ వ్యూహాల యెడల ఎలాంటి అవగాహన కావాలో, ఇప్పుడు ఈ నాల్గవ భాగంలో అందించబడుతూ ఉన్నది. ఈ నాల్గవ భాగం నుండి అందించబడుతున్న ఈ అవగాహన మనిషి నిరాటంకంగా తన కర్తవ్యాన్ని నిర్వహించే లాగున చూస్తుంది. ఆ నిర్వహణలో అతడు పరిపూర్ణుడయ్యే లాగున కూడా చూసుకుంటుంది. అలాంటి నిర్వహణ సామర్థ్యం, అలాంటి పరిపూర్ణత చదువరులందరూ తృప్తిగా పొందగలరని విశ్వసిస్తున్నాను.

విజయవాడ
6-4-90

మోపిదేవి కృష్ణస్వామి.

# సింహ గర్జన

బందరులో గురుపూజలు ఆరంభమై అది రెండవ సంవత్సరమను కుంటాను. గొడుగు పేటలోని కన్యకాపరమేశ్వరి సత్రం గురుపూజా వేదికగా రూపుధరించి కళకళలాడి పోతోంది. సత్రం పైభాగాన వేదిక. క్రింది భాగాన వంటలు, వడ్డనలు.

సమయం సాయంత్రం 4 గంటలు కావస్తోంది. లలితా సహస్ర నామ పూజ అప్పుడే పూర్తి అయినట్లుంది. వివిధ ప్రాంతాల నుండి అక్కడకు చేరుకున్న సోదరబృందం ఆ కాస్త వీలులో వీలు చేసుకుని ఒకరి నొకరు పలుకరించుకుంటున్నారు. వారి పలకరింపులకు చేయూత నిచ్చే విధంగా కార్యకర్తలు వారికి తేనీరు అందిస్తున్నారు.

ఉల్లాసంగా ఉన్న వాతావరణం ఒక్కసారిగా వేడెక్కింది. కారణం గంభీరమైన వదనంతో మాష్టరుగారు గబగబా మేడపైకి మెట్లు ఎక్కు తున్నారు ఘోరారణ్యంలో తీక్ష్ణరూపాన్ని ధరించిన సింహంలా ఉన్నారు ఆయన. అది నిజమే. ఈ జనారణ్యంలో ఆయన నిజంగా సింహమే.

ఐదు నిముషాలు అలా కాలం గడుపుదామనుకున్న సోదరులు ఆ తేనీరు ఎలా త్రాగారో ఏమో! అరనిముషంలో పై భాగంలోని వేదిక ముందు బారులు తీర్చిమరీ ఆసీనులయ్యారు. శక్తివంతమైన అయస్కాం తానికి దక్కున అతుక్కున్న ఇనుపముక్కల్లా వాళ్ళకు తెలియకుండానే వాళ్ళక్కడకు చేరుకున్నారు.

సింహగర్జన ఒకటి వినపడింది అంతలోనే అక్కడి వారందరికీ తీక్ష్ణ గంభీర వదనంతో జనారణ్యంలోని సింహం చేస్తున్న గర్జన అది.

ఇప్పుడే ఇంతకు ముందే ఈ మెట్లు ఎక్కబోతున్నప్పుడు ఒకాయన పనిగట్టుకొని వచ్చి మరీ అడిగాడు. పాపం ఎంత బాధ పడిపోయాడో ఏమో? "మీరందరికీ వేదం నేర్పుతున్నారట కదా! స్త్రీలకు కూడా వేదం నేర్పుతున్నారట కదా! గాయత్రి స్త్రీ పురుష అందరిచేత సామూహికంగా పఠన చేయిస్తున్నారట కదా! ఇది శాస్త్ర సమ్మతమే నంటారా?" అని అడిగాడు.

ఇది ఎలా శాస్త్ర సమ్మతమో చెప్పబోయే ముందు నేనొకటి అడుగుతున్నాను. ఆ పెద్దమనిషి వేదశాస్త్రాలను అధ్యయనం చేయడానికి అవకాశం, అర్హత ఉంది అనుకుంటున్న కుటుంబంలో జన్మించినవాడే. మరి ఆయన వేదాధ్యయనం చేస్తున్నాడా? రోజూ సంధ్యా వందనమైనా చేస్తున్నాడా? కనీసం గాయత్రినైనా జపిస్తున్నాడా? ఆ పెద్ద మనిషి ఇక్కడే ఈ సభలోనే ఉన్నాడు. సూటిగా తెలుగులో అడుగుతున్నాను. దమ్ముంటే చెప్పమని. ఏ మాత్రం చీమూ, నెత్తురు అతనిలో ఉన్నా లేచి నిల బడాలి. "ఏం! ఈ అర్హత ఉందనుకుంటున్న వాళ్ళందరినీ వేదాధ్యయనం మానమనీ, సంధ్యావందనాన్ని వదిలి పెట్టమనీ, గాయత్రిని కూడ వదిలేయ మనీ. జందాలను మేకులకు తగిలించమనీ. సదాచారాన్ని సన్యసించి వ్యసన పరులై తిరుగాడమనీ ఏ శాస్త్రం చెప్పిందని" నేను అడుగుతున్నాను. ఈ పనులన్నింటికీ ఏ శాస్త్రం సమ్మతిస్తుందని మీరు చేస్తున్నారు అని నేను అడుగుతున్నాను. అర్హత లేనివాళ్ళు చదువు తున్నారేమి? అని అడిగే ముందు అర్హత ఉందనుకుంటున్న మీరు ఎందుకు చదవటం లేదో నాకు వివరించి చెప్పండి. అది మీరు చెప్పగలిగితే ఏ అర్హత ప్రకారం వాళ్ళకీ విద్యలన్నీ నేర్పుతున్నామో మేం చెబుతాం. మీరు చదవరు. వాళ్ళను చదవ నివ్వరు. ఆహా! వేదపురుషుడికి మీరు చేస్తున్న సేవ ఎంత గొప్పగా ఉంది.

నేనింకొక్కమాట అడుగుతున్నాను. ఇవాళ విదేశాలలో ఏ మూల చూసినా వేదం వినబడుతోంది. గాయత్రి ప్రతిధ్వనిస్తోంది. విదేశీయుల్లో ఎందరో పంచశిఖలు పెట్టుకొని ఉపనయనాలు చేసుకుంటున్నారు. సనాతన ధర్మానికి అంకితమై బ్రతుకుతామని దీక్ష తంపువగా యజ్ఞోపవీతాన్ని స్వీకరిస్తున్నారు. మరి వాళ్ళందరినీ మీరు ఆపగలరా? వేదవిద్యకు మీరు అనర్హులని వారితో అనగలరా? అనండి చూద్దాం. జవాబేమివస్తుందో! మరి అలాంటప్పుడు ఆపాశ్చాత్యులని అడ్డుపెట్టలేనప్పుడు ఈ దేశంలో మీలాటి వాళ్ళని, మీ తోబుట్టువులను అడ్డుపెట్టాలని ఎందుకు చూస్తున్నారు. ఏం? వీళ్ళు లోకువగా కనపడుతున్నారనా? నాకు తెలుసు. భారతీయుడు భారతీయుణ్ణి తప్ప ఇంకెవరినీ లోకువగా చూడలేడు మన వాళ్ళని మనమే తగని వాళ్ళగా. అనర్హులుగా, అస్పృశ్యులుగా, బానిసలుగా చూడగలిగిన ఘనులం మనం. మళ్ళీ యీ ఘనులందరూ ఒక్క తెల్ల తోలువాడు కనిపిస్తే చేతులు నలుపుకుంటూ తలలు దించుకుని మరీ నిలబడతారు ఆలోచించండి! ఆలోచించుకోండి! భారతీయులము అయిన మనం ఆత్మపరిశీలన చేసుకొని, మనని మనం సరిదిద్దుకోగల్గిన నాడే పవిత్రమైన భారతధర్మానికి మనం వారసులం కాగలుగుతాం. ఆత్మ పరిశీలన ఏ మాత్రం కొరవడినా ఇలాగే కొనసాగడానికి ఏ మాత్రం మనం ప్రయత్నించినా ఒకటే జరుగుతుంది. అదేమిటో తెలుసునా? అన్నింటితో పాటు ఆత్మ విద్యను, వేద విద్యను కూడ ఆ పాశ్చాత్యుల దగ్గర నుండే మనం అప్పుతెచ్చుకోవాల్సి వస్తుంది. కర్మాచరణలో అలసులమై ద్రవ్య పరమైన అప్పు చేస్తున్నాం. వేదవిద్య యెడల అలసులమై ఇక పైన వేద పరమైన ఋణాలనుకూడా తీసుకుందాం. తెల్లవాడు చెబితే మనకు ప్రమాణం కదా! అందుకని వేద పురుషుడు తెల్లవాణ్ణి వరించి వాడి చేత మనకు శిక్షణ నిప్పిస్తాడు భిక్షను పెట్టిస్తాడు. అప్పుడు మనకు తృప్తిగా ఉంటుంది. ఇప్పటి తరం వారికది ప్రెష్ ఛానల్ కదా మరి!

ఏడీ! ఆ పెద్ద మనిషి ఇప్పటికైనా లేచివచ్చి నేను చెప్పినదానికి జవాబు చెప్పగలిగితే సంతోషిస్తాను నాకు తెలుసును అతడు లేవడు కార్యకర్తలు తర్వాత కార్యక్రమానికి సిద్ధం కావచ్చును. అంటూ ఒక్క ఉదుటున లేని వేదిక ప్రక్కనున్న కుర్చీలో కూర్చున్నారు మాష్టరుగారు.

సభ అంతా నిశ్శబ్దం. అలా ఆ నిశ్శబ్దం కొన్ని నిముషాలను తనలో ఇముడ్చుకో గలిగింది.

# భూ ప్ర ద క్షి ణ ం

విశాఖపట్నంరైల్వే న్యూకాలనీలోని రామాలయ ప్రాంగణం తోరణాలతో కళకళ లాడుతోంది. వివిధ ప్రాంతాల నుండి చేరవచ్చిన జన సందోహాలతో కిటకిటలాడిపోతోంది. అది మాష్టరుగారు తొలిసారిగా ఇతర దేశాలకు వెళ్ళి జ్ఞానభిక్షను పెట్టి వచ్చిన సందర్భంగా ఏర్పాటయిన స్వాగతసభ. మాష్టరుగారికీ, వారితో వెళ్ళి వచ్చిన వర్మ గారికీ పూర్ణ కుంభంతో స్వాగతం పలికారు సోదర బృందం. ఆనందోత్సాహాలతో ఆ ఇరువురిని తోడ్కొని వచ్చి ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన ఆసనాలపై ఆసీనులను చేశారు.

రెండు నెలల పాటు మాష్టారుగారిని విడిచి ఉండటం సోదర బృందానికి అప్పటికి క్రొత్త. బారులు తీర్చి కూర్చున్న సోదర బృందం ఒడలెల్ల కనులు చేసుకొని మాష్టరు గారిని చూస్తున్నది. చెవులన్నింటిని పెద్దవి చేసుకొని ఆయన నోటినుండి వెలువడే మాటలను వినవలెనని ఎదురు చూస్తున్నది. ఆ సాయంత్రం పౌర సన్మానం ఒకటి వేరే ఏర్పాటు చేయబడి ఉన్నది. ఇది సోదర బృందం ఇప్పటి ముచ్చట. మాష్టరుగారు కూడ ఎన్నినాళ్ళకు ఇలా ఆత్మీయుల మధ్య వుండేటందుకు

పీలు కలిగిందిఅన్నట్లు ఆత్మీయతను వర్షించే కన్నులతో అన్ని వైపులకు చూస్తున్నారు.

తమ హృదయ వేదికపై తమవారి నందరిని ఒక్కసారిగా చూసుకుంటూ లేచి నిలబడి మాష్టరు గారిలా అన్నారు. "నేను దీనిని "విదేశీ యాత్ర" అనను. భూప్రదక్షిణ మంటాను. భూమి అంతా ఒక్కటే. వసుధైక కుటుంబమన్నది మనవారి ఆశయం. మరి మనకు విదేశ మెక్కడ? సకల దేశస్తులూ మన వారే. అందరూ మానవులే. మనలాంటి వారే. మనలాగానే వాళ్ళకూ కష్టసుఖాలూ, రాగద్వేషాలూ, అన్నీ ఉంటాయి. కాకపోతే ఆయా జాతుల నేపథ్యాన్ని బట్టి కొంచెం పాళ్ళ తేడా. వైఖరులు తేడా. అంతే, ఆచార వ్యవహారాలలో తేడా తప్ప మానవత్వం అంతటా ఒక్కటే.

అయితే ఒక చిన్న తేడా ఉంది. మనకు హృదయం ఎక్కువ పని చేస్తుంది. వాళ్ళకు మనస్సు ఎక్కువ పని చేస్తుంది. మన మనస్సుకు శిక్షణ తక్కువ. వాళ్ళ మనస్సుకు శిక్షణ ఎక్కువ. వాళ్ళు మనస్సునెంత పకడ్బందీగా నడిపిస్తారూ అంటే హృదయం కదిలేందుకు, కరిగేందుకు అవకాశం లేనంతగా నడిపిస్తారు. ప్రేమాభిమానాలకన్నా ఫార్మాలిటీస్ ఎక్కువ వాళ్ళకి. చిత్రమేమంటే మేము వెళ్ళేటప్పటికి ఫార్మాలిటీస్ మధ్యలో నలిగి పోతున్న వాళ్ళు మాతో కలిసి, తిరిగి, మళ్ళీమేం తిరిగి వచ్చేస్తుంటే హృదయోద్వేగాన్ని అనుభవిస్తూ కళ్ళవెంట నీరు కార్చారు. అలాంటి సన్నివేశాలు ఆ దేశాల్లో చాలా తక్కువట. కన్నీటితో మళ్ళీ ఎప్పటికి కల్సుకుంటామని హృదయాలతో అడుగుతూ వాళ్ళంతా కలిసి వీడ్కోలు చెప్పిన ఆ సన్నివేశం నాకింకా గుర్తుకొస్తూనే ఉంది. ఎప్పటికీ అది అలా గుర్తుంటుంది. అదొక మధురస్మృతి. మనస్సులు కరిగి, హృదయాలు విప్పారిన శుభవేళ అది. ఇంతదూరం నేను చేసిన ప్రయాణం ఫలించింది అనిపించింది.

ఇక మా సంగతి కొస్తే భూమి మీద అన్ని ప్రాంతాలు తిరిగిన మీదట నేను గ్రహించిన దేమంటే ఇటువంటి దేశం, ప్రదేశం ఈ భూమి మీద ఇంకెక్కడా లేదని. నేను అభిమానంతో అంటున్న మాటలు కావివి. లోతైన అవగాహనతో అంటున్న మాటలు. ఈ భూమి మీద పుట్టిన అదృష్టవంతులం మనం. కాని ఈ అదృష్టాన్ని సద్వినియోగం చేసుకోడానికి చాల కృషి చెయ్యాలి. బద్ధకస్తులం కాకూడదు. నేనదీ గమనించాను. మానవ శక్తిని సద్వినియోగం చేయకుండా బద్ధకిస్తున్న జాతుల్లో మనది ఫస్టుమార్కు వస్తోంది. మనతో పాటు మనకు కొంచెం ప్రక్కగా వెస్టు జర్మనీ వాసులు చేరుతున్నారట. ప్రపంచ మేధావులు ఈ విషయంలో బద్ధకించకుండా లెక్కలు కట్టిమరీ చెబుతున్నారు. కనుక మనం గతాన్ని తల్చుకుంటూ పొంగిపోక, గతాన్ని మించిన భవిష్యత్తును నిర్మించగలగాలి. అంటే మనం ఈ వర్తమానంలో తపస్సు చేయాలి, అనే వర్తమానాన్ని మనందరి కోసం పట్టుకొచ్చాను.

ఎన్నాళ్ళైంది. ఈ విశాఖ పట్టణాన్ని చూచి, మిమ్మల్నందరినీ చూచి. నాకేమనిపించిందో తెలుసునా? అక్కడ ఉన్నంత కాలం. మనం మళ్ళీ విశాఖపట్టణం ఎప్పుడు వెళ్ళిపోతాం? అక్కడ స్నానానికి అని పెద్ద బకెట్టుతో నీరు తోడి పెట్టబడితే చెంబుతో ముంచుకుని పోసుకునే ఆ మంచిరోజులు మళ్ళీ ఎప్పటికొస్తాయి అని. ఎందుకని ఇలా అన్నానంటే ఆ దేశాల కథవేరు. ఆ చలిదేశాలలో వారానికొక్కసారి స్నానం చేసినా సరిపోతుంది వారికి. దేశం మారాం కదా అని మనం మన అలవాట్లు మార్చుకోగలమా? రోజూ ప్రొద్దున, సాయంకాలము పనిగట్టుకొని నీళ్ళు సేకరించి స్నానం చేస్తుంటే విచిత్రంగా చూసేవాళ్ళు. అయితే ఇన్ని ఇబ్బందులుంటే అనవసరంగా అక్కడికెందుకు వెళ్ళావయ్యా? అని మీరు అడగవచ్చు? అక్కడున్నదీ మనుషులే కనుక. వాళ్ళకూ ఈ సందేశం అందాలి కనుక!

ఆ దేశంలో భారతీయులను రెండు వర్గాలుగా విభజిస్తారు. స్కాలర్ షిప్పులు మొదలైన వాటి పేరిట విద్య మెత్తడానికై అక్కడ చేరిన వర్గం మొదటిది. వాళ్ళనసలు పెద్దగా లెక్క చేయరు వాళ్ళు. ఇక ఆ దేశ వాసులకు జ్ఞానభిక్ష పెట్టడానికై ఇక్కడి నుండి తరలి వెళ్ళిన పెద్దలు రెండవ వర్గంగా పరిగణింప బడతారు. భారతీయతను వాళ్ళదాకా పట్టు కెళ్ళిన భారతీయులంటే వాళ్ళకంత అభిమానం. భారతీయతను మరచి పోయి విదేశాలను విచ్చ మెత్తుకుంటున్న భారతీయులు అంటే వాళ్ళు చుల కనగా చూస్తారు. అయ్యో! అక్కడ పుట్టినా కూడా వీళ్ళకి అంటిన దేమీ లేదే అనే బాధతో కూడిన చులకన భావమది.

ఇక అసలు విషయానికొస్తే ఒక ప్రత్యేకమైన ప్రణాళికలో భాగంగా మనం అక్కడికి వెళ్ళాం. వెళ్ళిన ప్రతిచోట హృదయ ద్వారాలు తెరిచి అన్ని దేశాల వాళ్ళు స్వాగతాలు పలికారు. ప్రవచన కార్యక్రమా లను పెద్ద ఎత్తున నిర్వహించుకున్నారు. వాల్ పోస్టర్లపైన, న్యూస్ పేపర్లలోనూ, టి. వి. లలోనూ ఈ కార్యక్రమాలను అందరికీ అందే లాగున వాళ్ళు చూచారు. ఎన్నో సంస్థల వారు, ఎన్నో బృందాలవారు అక్కడ కలిశారు. ఒక మహోత్సవంగా నడిపారు. అయితే ఒక్క ప్రశ్న. వారు స్వాగతం పలికింది ఎవరికి? కార్యక్రమాలు నడిపింది ఎవ రికి? ఉత్సవాలను జరిపించింది ఎవరికి? ఈ శిరస్సున స్వీకరించి తీసు కెళ్ళిన వేదాలకు, ఉపనిషత్తులకు, సనాతన ధర్మానికి, భారతీయతకు. మనం యీ సత్యాన్ని మరచిపోకూడదు. వాళ్ళు మనని చూడలేదు. మనలో ఒక వేదాన్ని చూశారు. ఒక యోగాన్ని చూశారు. ఒక శాంతి సందేశాన్ని చూశారు. దానికి శిరస్సువంచి నమస్కారం చేశారు. ఇప్పటి నుండే కాదు. వివేకానందుడి నాటినుండి వాళ్ళిలా చేస్తూనే ఉన్నారు. యీ దేశం నుండి వివేకానందులే రావాలని వారు కోరుకుంటున్నారు. వచ్చి తమలో వివేకాన్ని వెలిగించి, తమను ఆనందాంబుధిలో ఓలలాడింప జేయా

లని వారు అభిలషిస్తున్నారు. అలా జరిగిన ప్రతిసారీ, అలాంటి అనుభూతి వారి కందిన ప్రతిసారీ వాళ్ళలాగే కేరింతలు కొడుతున్నారు. ఉత్సవాలు చేస్తున్నారు. కనుక భారతీయులమైన మన కర్తవ్య మేమిటో గ్రహించండి. భారతీయుల నుండి మిగిలిన దేశాలవారు కోరుతున్నదిది. అర్థం చేసుకోండి. మన పాత్ర పోషణకు మరింతగా మనంఅంకితం కావడానికి ఈ భూ ప్రదక్షిణం మనకు సహకరిస్తున్నది.

సందేశం పూర్తయినట్లు ఎవరికీ అనిపించలేదు. ఎందుకనంటే అదింకా అందుతూనే ఉంది కనుక. ఇలా అందుతూనే ఉంటుంది గనుక.

# మీ పైననే వర్షం చూపంతా

విశాఖపట్నం రైల్వే స్టేషన్‌కు ప్రక్కనే ఉన్న రైల్వే ఇన్స్టిట్యూట్ ఉత్సవరంగంగా రూపొంది ఎక్కడెక్కడి జనాన్ని ఆకర్షించుకుంటోంది. స్త్రీలు, పురుషులు, పెద్దలూ, పిన్నలూ ఆబాలగోపాలంగా అక్కడికి చేరుకుంటున్నారు.

ఆ నాడు జనకుల విద్యాలయ వార్షికోత్సవం. వార్షికోత్సవ సభలో పాల్గొనాలని ఒకవైపు, ఈ వార్షికోత్సవం సందర్భంగా మాష్టరుగారి సందేశంలోని వైభవాన్ని కనులారా దర్శిద్దామని మరోవైపు జనం బృందాలు బృందాలుగా తరలి వస్తున్నారు. విద్యార్థులు, విద్యార్థుల తల్లితండ్రులు, అధ్యాపక బృందం, సోదర బృందం, పట్టణ ప్రముఖులు ఇలా ఎందరో, ఎందరెందరో ఆ చేరుకుంటున్న వారిలో ఉన్నారు.

అధ్యక్షులు, ముఖ్య అతిధులు జనకులం ప్రగతిని గూర్చి పలు విధాల ప్రస్తుతించిన మీదట మాష్టరుగారు లేచి ఒక్కసారి సభనంతటను కలయజూచి ఇలా అన్నారు. "దైవయోగం చేత గుంటూరు నుండి విశాఖ

రావడం జరిగిన తరువాత వైద్యసేవ, ప్రవచన కార్యక్రమాలు ఇంతింతై వటుడింతై అన్నట్లుగా విస్తృతి చెందటం మొదలుపెట్టాయి. ఈ విస్తృతి ఒకఎత్తు, ఈ విస్తృతి ద్వారా నాకు దగ్గరై, నావారై నాతో నడవటమే తమ జీవిత లక్ష్యంగా స్వీకరించిన వ్యక్తుల సంఖ్య నానాటికీ పెరుగుతూ రావడం మరొక ఎత్తు. వ్యక్తులు దగ్గరయ్యారు. వాళ్ళ కుటుంబాలు దగ్గరయినాయి. ఈ రోజున కొన్ని వందల కుటుంబాలు ఒకే ఒరవడిలో నడుస్తున్నాయి.

కథ ఇక్కడిదాక వచ్చిన తరువాత ఆయా కుటుంబాల పెద్దలను పిలిచి కూర్చోబెట్టి ఇలా చెప్పాను. చూడండి! పిల్లల చదువు విషయంలో మీరెన్ని ఇబ్బందులకు గురి అవుతున్నారో గమనించారు కదా! డ్రస్సులనీ, బస్సులనీ అట్టహాసమే ఎక్కువ కనబడుతోందితప్ప అసలు లక్ష్యం నెరవేరుతోందా? ఈ కనబడుతున్న నానావిధ విద్యాలయాల్లో విద్యార్థికి నిజంగా న్యాయం జరుగుతోందంటారా? న్యాయం జరగటం లేదని తెలిసి కూడ మీరిలా ఊరుకుండిపోతున్నారేమి? ఏం? మీలో విద్వత్తు ఉన్నవాళ్ళు ఉన్నారు. బోధనా సామర్థ్యం ఉన్నవాళ్ళున్నారు. సేవాభావంతో పని చేయడానికి సిద్ధపడ్డవాళ్ళున్నారు. ఏమి? మీలోనే కొంతమంది కలిసి మీ పిల్లల కోసం ఒక విద్యాలయాన్ని నెలకొల్పగలిగితే? మన పిల్లలతో పాటుగా మరిందరి పిల్లలకు కూడ విద్యాదానం చేయవచ్చుగదా! మీలో ఉద్యోగస్థులున్నారు. పదింటికి మీ కార్యాలయాలు. తొమ్మిదిగంటలవరకు మన విద్యాలయాల్లో పని చేయవచ్చుకదా! విద్యావంతులైన గృహిణులున్నారు. యువకులున్నారు.అందరూ కలిస్తే అసాధ్యమేముంది?

నా మాటలు వాళ్ళకు నచ్చాయి. మీ సారథ్యం ఉండగా అదెంత పని మాస్టరుగారూ! అన్నారు వాళ్ళు. అనటమేకాదు చేసి చూపించారు. అత్యద్భుతమైన ఫలితాలను తీసుకొచ్చారు. జననీ జనకులచేత నెలకొల్ప

బడిన ఈ విద్యాలయం జనకులమైంది. ఆధునిక గురుకులమైంది. నేను ఎన్నో ఉత్సవాల్లో పాల్గొని ఉండవచ్చు. ఇక ముందు ఎన్నో ఉత్సవాల్లో పాల్గొనవచ్చు. కాని ఇది నాకు ఇష్టమైన ఉత్సవం. ఇది నేను కోరిపాల్గొనే ఉత్సవం. ఇది నన్నుపిలుచుకున్న ఉత్సవంకాదు. నాకు నచ్చి నేనుగా వచ్చిన ఉత్సవం. తల్లి బిడ్డను ఆదమరచి ముద్దాడటం వంటిదిఇది.

అలాగే దగ్గరయిన వారిలో కొందరు తండ్రులు ఎదిగి వచ్చిన తమ బిడ్డలను ఏం చేయాలా? అని చూస్తున్నారు. చదువులైతే చదివించారు. చేతిలో పనిగనుక. మరి ఉద్యోగాలో! ఉద్యోగాలు దొరకాలి అంటే ముడుపులుచెల్లించాలి అన్నారు వాళ్ళకేమో మరి అలాంటి అలవాట్లు లేవు. ముడుపులు లేకుండా ఉద్యోగాలిచ్చే అలవాట్లు అవతలివాళ్ళకు లేవు. ఏం చేయాలి? సరే కొందరు తండ్రులు ప్రాణం ఒప్పకపోయినా ముడుపులు పట్టుకు బయలుదేరారు. నేను మధ్యలో వాళ్ళను ఆపి ఇలా అన్నాను. ఈ ముడుపులు వాళ్ళకిచ్చి ఉద్యోగాలను కొనుక్కునే బదులు ఆ ఇచ్చేదబ్బేదో మీ అబ్బాయిలకే ఇచ్చి సమాజానికి మీకు చేతనైన పనిచేసిపెట్టి బ్రతకండి అని చెప్పవచ్చుకదా! కావలసిన అవకాశాలను వాళ్ళకు కలుగజేసి వాళ్ళను హీరోలుగా తీర్చిదిద్దవలసిన మీరు ఇలా వాళ్ళని చేతకానివాళ్ళుగా చేసి వాళ్ళతరపున మీరు ఉద్యోగాలను కొనుక్కురావడానికి బయలు దేరారా? ఏం? మీ పిల్లల సామర్థ్యం మీద మీకు ఆ మాత్రం నమ్మకం లేదా? వాళ్ళని జీరోలుగా చేయదల్చుకుంటున్నారా? ఒక్క క్షణం ఆలోచించండి. అన్న యీ నా మాటలు వాళ్ళకు నచ్చాయి. వాళ్ళ బిడ్డలు ఇప్పుడు ప్రెస్సులనీ, పరిశ్రమలనీ, నెలకొల్పి వాళ్ళే పదిమందిని పోషిస్తున్నారు. కొంతమంది యీ జనకుల విద్యాలయానికి కావలసిన సేవ చేసుకుంటున్నారు.

ఒకప్పుడు ఆత్మదర్శనంతో ఉర్రూత లూగిన జాతిమనది. ఇపుడు ఆత్మ విశ్వాసానికి కూడా ఇంత కరువొచ్చిందేమి టిక్కడ? రాకూడదు.

అలాకాకూడదు. ఈ తనకులం విద్యార్థులు చిన్నప్పటి నుండి నిండైన ఆత్మవిశ్వాసంతో ఎదిగిరావాలి. నిజమైనజీవితాలను వాళ్ళుజీవించగలగాలి. ఆత్మదర్శనాన్ని ప్రపంచ ప్రజలకు భిక్షగా అందించవలసిన జాతికి ప్రతి నిధులుమీరు. మీరు పరిపూర్ణులు కావాలి. మీరుపరిపూర్ణులు కావాలనీ అందుకు మీఅధ్యాపకులు మీకు దోహదంచేస్తారనీ నిండుగా విశ్వసిస్తూ మీకు నా శుభాశీస్సులు అందజేస్తున్నాను.

మీ జీవలక్షణాలకు పదును పెట్టవలసిన వాళ్ళం మేము ఆశయాల రూపకల్పనలో మాకు అందిరావలసిన వారు మీరు. మీపైననే మా చూపంతా!

సభా ప్రాంగణమంతా దివ్యమైన ప్రశాంతత వ్యక్తమౌతోంది. పవిత్రమైన నిశ్శబ్దం అది. అమృతప్రాయమైన మౌనమది.

తదుపరి కార్యక్రమమేదో జరుగుతోంది వేదికపైన.కాని సభలోని వారి చెవులకుమాత్రం ఆ వాక్కులే మళ్ళీ మళ్ళీ వినబడుతున్నాయి.



# ఆత్మ పరిశీలన చేసుకున్న వేళ

సాయంత్రం ౮ గంటలు కావస్తోంది. ఆంధ్రా యూనివర్శిటీ ప్రాంగణంలోని అసెంబ్లీహాలు దివ్య వైభవంలో దేదీప్యమానంగా వెలిగి పోతున్నది చిరునవ్వులతో వసంతాన చిగిర్చిన తరువుల్లా సోదర బృందమందరూ కళకళలాడుతున్నారు. కళకళలాడుతూ ఓపలేని ఆనందంతో కబుర్లాడుతున్నారు. అంతలో వరుసగా మరికొన్ని కార్లు వచ్చి ఆగాయి. మధ్య కారులో నుండి దిగుతున్న మాష్టరుగారి మెడలో అప్పటికే నిండుగా దండలున్నాయి. మెడను చుట్టుకునే దండ, తనను చుట్టుకునే దండు యీ రెండూ ఆయన సహజవైభవాలు.

చుట్టుముట్టుతున్న సోదర బృందాన్ని సరస సంభాషణలతో మైమరపిస్తూ ముందుకు సాగుతున్నారు ఆయన. ప్రేయరుకు టైమ్ అవుతున్నదని చెప్పకుండానే చెబుతూ. మరికొద్ది క్షణాల్లో ఇంతమందినీ ప్రణవం తనలోనికి స్వీకరించింది ప్రణవ నాదంతో ప్రాంగణం పునీతమై పోసాగింది.

భూప్రదక్షిణం చేసివచ్చిన మాష్టరుగారికై ఏర్పాటు చేయబడిన పౌరసన్మానసభ అది అప్పటికది అయిదవసారో ఆరవసారో ఆయన అలా భూప్రదక్షిణం చేసి రావడం వేదిక నిండుగా కన్నుల పండువుగా ఉన్నది. పెద్దలు, ప్రముఖులు, ఎందరెందరో మాష్టరుగారి ద్వారా వ్యక్తమవుతున్న వెలుగునకు అంజలి ఘటించారు. అలా అంజలి ఘటిస్తున్న వేళలో ఆ ఆ వెలుగుతో తాదాత్మ్యం చెందుతూ తామూ ఆ వెలుగై వారు మాట్లాడు తున్న వేళ సభ వారితో శృతికలిపి పరవశించిపోయింది. ఆ పరవశిస్తున్న వేళలో వారందరి హృదయమే తమ నిలయంగా గల మాష్టరుగారు

సందేశమిచ్చేటందుకై లేచి నిలబడ్డారు. పారవశ్యంలోనే సభ ఆయన వైపు ఏకాగ్రమైన, స్థితిలో చూస్తున్నది మాష్టరుగారు ఇలా అన్నారు. ఒక్కొక్కసారి భూప్రదక్షిణంచేసి వస్తున్నప్పుడు ఒక్కొక్క అనుభూతి, ఒక్కొక్క దర్శనం కలుగుతూ ఉన్నాయి. ఈసారి ఏమనిపించిందో తెలుసునా? వేదాధ్యయనం చేస్తున్నవారి సంఖ్య తగ్గింది అని మనం అనుకుంటున్నాం. అది పొరపాటు. వేదాధ్యయన పరుల సంఖ్య ఎప్పుడూ తగ్గదు అని.

భారతదేశంలో తగ్గింది కదా! కనబడుతూనే ఉంది కదా. అని మీరు అనవచ్చు. నిజమే. భారతదేశంలో తగ్గింది. ఈ తగ్గినవార విదేశాలలో పెరిగింది కనుక మొత్తం మీద లెక్క గడితే సంఖ్య సరిపోతుంది. కనుక వేదం చదువుకునే వారు తగ్గిపోయారు అని మనం బాధ పడనక్కరలేదు మనలో కొందరు యీ సంఖ్య తగ్గిపోతోందే, మరి వేదాన్ని రక్షించడం ఎలా? అని బాధ పడుతూ మాట్లాడుతూ ఉంటారు. నేను చెబుతున్నాను. మనం రక్షించాల్సినంతటి దీనస్థితి వేదాలకు రాలేదని, ఎప్పటికీ రాదనీ, వేదాన్ని కోల్పోతున్నందుకు భారతీయుడు భయపడాలి. బాధపడాలి. వేద ధర్మానికి దూరమై రక్షణను తాను కోల్పోతున్నానని భారతీయుడు గ్రహించగలగాలి. "నాయమాత్మా బలహీనే నలభ్యః బలహీనులకు అర్భకులకు దుర్బలులకు యీ విద్య దక్కదు కనుక అది తగిన వాళ్ళను స్వీకరించడానికై తరలి వెళుతోంది తప్ప ఓ భారతీయుడా! నీవనుకుంటున్నట్లు అది అంతరించి పోవడం లేదు అంత ప్రమాదం దానికెప్పుడూ రాదు. అది శాశ్వతమైనది. ఇలాంటి మనలాంటి తరాలను ఎన్నింటిని అది చూసిందో! లెక్క పెట్టగలమా? ఇపుడు చెప్పండి. అది మనని రక్షించే టందుకు నిలబడి ఉన్నాదా? లేక మనం దానిని రక్షించవలసిన వారమై ఉన్నామా? మనం మన ఇంటిలో దీపం తీసివేసి నంత మాత్రాన అగ్నిదేవుడం తర్ధానమై పోతాడా? వెలిగించుకుంటున్న

ప్రతిపోటూ వాడు వ్యక్తమవుతూనే ఉంటాడు కదా. వేదం అలాంటి అగ్నిలాంటిది.

ఇవాళ పాశ్చాత్య దేశాలలో ప్రతి విశ్వవిద్యాలయం లోనూ సంస్కృతి విభాగమున్నది. ఊరికే మనలాగ నామినల్‌గా ఉండటం కాదు. పేరుకు ఉండి ఏం లాభం? పేరు తెచ్చేటట్లు ఉండాలిగాని. అక్కడ ప్రతి సంస్కృత విభాగంలో చిత్తశుద్ధితో కూడిన పరిశోధనలు దీక్షగా సాగుతున్నాయి వేదశాస్త్రాల పైన పురాణఇతిహాసాలపైన విలువైన గ్రంథాలు ఎంతో అందమైన గెటప్‌తో వస్తున్నాయి. దేవతలు అంటే ఎవరు పితృ దేవతలు అంటే ఎవరు? రుద్రులు అంటే ఎవరు? ఆదిత్యులు అంటే ఎవరు? ఇలాంటి అంశాలన్నీ ఆదేశాలలో యీ సాధనలో ఉన్న యువకులందరూ అలవోకగా చెప్పగలిగి ఉంటారు.

కాని మనదేశంలో ఆధ్యాత్మికులుగా చలామణి అవుతున్నవారిలో ఎందరు చెప్పగలరు! యీ విషయం ఎందుకు చెబుతున్నానూ అంటే ఓ భారతీయుడా! యీ గడ్డపైన నీవు పుట్టావు. కాని నీ వారసత్వంలోని వైభవాన్నీ, శాస్త్రీయమైన బోధనూ, నీవు ఎంతవరకూ గమనించగలిగావు. అని హెచ్చరించడానికి! బద్ధకస్తుడివై, అలసుడివై పొట్టకూటికే కాలం మొత్తాన్ని ఖర్చు పెట్టుకుంటున్న నిన్ను చూస్తే నాకు బాధ వేస్తోంది. జాలి వేస్తోంది. కోపం వస్తోంది చేయవలసింది చేస్తే రావలసింది అదే వస్తుంది. జీవితకార్యాన్ని నిర్వహించడంలో నీవు నిమగ్నమై ఉంటు ఇక జీవితా వసరాలంటావా! అవి నిన్ను వెతుక్కుంటూ వస్తాయి. ఏం? సముద్రం వైపుకు పరుగెత్తుకుంటూ వెళ్తున్న నదులని నీవు ఎప్పుడూ చూడలేదా! కర్తవ్యాన్ని విస్మరించినవాడే పొట్ట కూటికై వెతుక్కో వలసిన స్థితిలో పెట్టబడతాడు. ఎప్పుడైతే ఆ స్థితికి దిగజారాడో ఇక వాడికి జీవితమే సమస్య. ఇవాళ మనం సమస్యలు, సమస్యలు అంటున్నాం. అవి

ఎందుకు చుట్టు ముడుతున్నాయో ఇప్పుడైనా గ్రహించండి జీవితాన్ని సద్వినియోగం చేస్తున్నవాడికి సమస్య అనేదే ఉండదు. సద్వినియోగం చేయడం మానినవాడికి సమస్యలు తప్ప ఇంకేమీ ఉండవు ఇదే యీ పవిత్ర భూమి ప్రపంచానికి అందిస్తూ వస్తున్న సందేశం అందుకే దీన్ని ధర్మభూమి. అన్నారు. కర్మభూమి అన్నారు అలాంటి యీ దివ్య సందేశాన్ని పెద్దలెందరో సకల దేశస్థులకూ అందిస్తున్న వేళ నానా జాతులను మేలుకొలుపుతున్న వేళ భారతీయులారా! మీరు యీ సందేశం పెడల ఏమరుపాటు చెందడం ధర్మమా!

ఇవాళ మనం ప్రొద్దున్నే లేవడానికి బద్ధకిస్తున్నాం. తెల్లవారు ఝామునే లేచి, తగుమాత్రంగా ఆసనాలూ అవీ వేసుకొని, శరీరానికీ, మనస్సుకూ శృతి కుదిర్చి వాటిని చైతన్యవంతంచేసి, ఆపైన స్నానాదికాలు పూర్తి చేసి, దైవధ్యానంతో మిగిలిన సాధనను కొనసాగించి అటుపైన పవిత్రమైన ఆ ఉపాధితో కర్తవ్యనిర్వహణలోనికి ప్రవేశించడం ఒకప్పటి మన అలవాటు. ఇవాళ మనలో ఎక్కువ మందిమి వాటన్నింటినీ వదిలేసుకున్నాం. ఆసనాలు మరచిపోయాం పెద్దలు అందిస్తూ వచ్చిన సింహాసనాలను దేవుడి విగ్రహాలను, సాలగ్రామాలను, ఏ దేవాలయాలకో అప్పగించి చేతులు దులుపుకుంటున్నాం. మనని మనం పవిత్రీకరించుకోకుండానే విధి నిర్వహణలోనికి వెళుతున్నాం విధిలేక పని చేస్తున్నాం. విధిని నిందించుకుంటూ కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నాం. కాని మొన్న మొన్నటి దాక యాంత్రికంగా పని చేసిన ఆ దేశాలలో ఇపుడేం చేస్తున్నారో తెలుసునా? ఊరూరా యోగ విద్యాలయాలు నెలకొల్పుకుంటున్నారు భార్యా భర్తలే యోగసాధన నిచ్చే ఉపాధ్యాయులుగా రూపొందిన వారెందరో ఉన్నారు. భర్త పురుషులకూ, భార్య స్త్రీలకూ యోగాభ్యాసంలో శిక్షణనిస్తూ రూపు దిద్దుతూ ఉంటారు. ఇక ఆధ్యాత్మిక శిక్షణకై వెలుస్తున్న ఆశ్రమాల

సంగతి చెప్పనే అక్కరలేదు. మొత్తం మీద ఒకప్పటి మన దినచర్యను తమ దినచర్యగా రూపొందించుకొనేటందుకై దీక్షతో వారు కృషి చేస్తున్నారు. ఆధునికమైన సౌకర్యాలను, శాస్త్ర విజ్ఞానాన్ని ఈ యోగ శిక్షణలో చక్కగా వినియోగించుకుంటున్నారు. ఆధునిక విజ్ఞానమంతా వాళ్ళకందుకు వినియోగపడుతోంది. టేప్‌రికార్డర్లు, టి. వీ. ఛానల్స్, వీడియో, రేడియోలు అన్నింటినీ ఈ దివ్య సాధనకోసం రకరకాలుగా వాళ్లు వినియోగిస్తున్నారు. మనమేమో ఆయా పరికరాలనన్నింటినీ కొని పెట్టుకొని, పట్టుకుని, చూసుకుని మురిసిపోతున్నాం. వాళ్ళకవి సౌకర్యాలు. మనకవి స్థోమతకు చిహ్నాలు. చూశారా! దృష్టులమధ్య తేడా ఎలాంటిదో! ఈ అంశం వంటపట్టడానికి కొన్ని దృశ్యాలు మీ ముందుంచుతాను. మనం ఆధ్యాత్మిక ప్రసంగాలను కాలక్షేపంగా గడిపివచ్చేటందుకు అలవాటు పడుతున్న వాళ్ళం. వాళ్లు అలా కాదు. ఇష్టం లేకపోతే రాడు. వస్తే శ్రద్ధగా వింటాడు. అర్థం కాకపోతే అర్థం అయినట్లు నటించడు. అడిగి మరీ తెలుసుకుంటాడు. అర్థమయిన దాన్ని ఆచరణలోనికి తెచ్చుకునేవరకూ విశ్రమించడు. అందుకు సిద్ధమయి తేనే వాడు అడుగు పెడతాడు. ప్రసంగానికి వచ్చిన అన్ని వందలమందీ ఒక్కొక్కరు ఒక్కొక్క టేప్‌రికార్డర్ తెచ్చుకుంటారు. ప్రసంగంతోపాటే టేప్‌రికార్డర్లన్నీ ఒకే సారి ఆన్ అవుతాయి. సరిగా అరగంట అయ్యేసరికి అన్ని వందల టేప్ రికార్డర్లు ఠక్కున లేస్తాయి. అదిగమనించి ఒక అర నిముషం ఆగే వాణ్ణి. మళ్ళీ మొదలు. ఒక ప్రక్కనుండి ఈ ప్రసంగం మొత్తాన్ని వీడియోతీసే కార్యక్రమం నడుస్తూ ఉంటుంది రెండు మూడు వైపులనుండి రెండు మూడు కెమేరాలు క్లాసు జరిగినంతసేపూ తీస్తూనే ఉంటాయి ఇక బోర్డుపైన పేపరు బోర్డు అమర్చబడి ఉంటుంది. ఇలా వ్రాస్తూ ఉండే అలా చుట్టు కుంటూ ఉంటుంది అది. ఆ చుట్టుకుంటున్న చుట్టలన్నింటినీ శ్రద్ధగా ప్రిజర్వు చేస్తారు. వాళ్ళు ఇప్పటికన్ని సంవత్స

రాలుగాను ఇలా చేస్తూనే ఉన్నారు ప్రసంగం కాగానే కొంతసేపు ప్రశ్నోత్తరాల కని కేటాయిస్తారు. ఆనాటి ప్రసంగంలోని అంశాలను గూర్చి అడగాలను కున్నవి అడిగి, శ్రద్ధగా వాటిని టేప్ చేస్తారు. ఇంతటితో ఊరుకోరు. ఆ టేప్‌లను వింటూ టైపు చేసి ఆ కాగితాలను మనకీ, వారితో శృతికలిపిన మిగిలిన ఆధ్యాత్మిక సంస్థలకూ అంద చేస్తూ ఉంటారు. అందులో కొందరు టైపు చేయడంతో ఆగకుండా తమ తమ భాషలలోనికి అనువాదం చేస్తూ ఉంటారు ఇలా ఈ రోజున ప్రధాన భాషలన్నింటిలోనూ మన ప్రవచనాలు, గ్రంథాలు అనువాదం చేయబడి ఆయా దేశాల యోగవిద్యాలయాల్లో అధ్యయనం చేయబడుతు న్నాయి. ఇలా ఉంటుంది వారి కృషి. "మైత్రైట్" అని మనకొక పత్రిక ఉంది. అది మీకు తెలుసు. మన సంస్థ నుండి వస్తున్న పత్రికే అయినా మనవాళ్ళలో దాన్ని ఉపయోగించుకునే వాళ్లు తక్కువ. వాళ్ళేం చేశారో తెలుసునా? మైత్రైట్‌ని జాగ్రత్తగా అధ్యయనం చేస్తూ అందులో సీరి యల్‌గా వస్తున్న రచనలను ఇతర భాషల లోనికి ఎప్పటికప్పుడు అనువాదం చేస్తున్నారు.

ఈ మధ్యనే అందులోని విష్ణుపురాణ వ్యాఖ్యానానికి చక్కని జర్మన్ అనువాదాన్ని నాకు అందించారు. ఆ విష్ణుపురాణ వివరణలోని సాంకేతిక పదాలను సేకరించి దానికి వివరణ వ్రాయించి పంప వల సిందిగా నాకు అందచేశారు. ఇవి మచ్చుకు కొన్ని ఉదాహరణలు. అయితే అంతా మంచే చెబుతున్నారు, వాళ్ళ గురించి, వాళ్ళలో లోపాలు లేవా అని మీరు అనవచ్చు. ఎందుకు ఉండవు అవి వాళ్ళకు చెబుతాను. వాళ్ళ దగ్గర మీ లోపాలు చెప్పను. మీలో ఉన్న మంచి లక్షణాలన్నీ వాళ్ళకు చెప్పి వాళ్ళు ఎదిగేటట్లు చూస్తాను. ప్రాక్-పశ్చిమాల మధ్య సమన్వయ సారథిగా ఇది నాకర్తవ్యం. కనుక ఇంతటి ఆదరాభిమానాలతో

మీరందరూ మీమీ ఒత్తిడి జీవితాల మధ్య నుండి ఇక్కడకు చేరుకున్నారు. మీ హృదయాలనే పూలుగా చేసి, దండలుగా రూపొందించి నన్ను ముంచెత్తారు. మీ శ్రేయోభిలాషిగా ఆ సందర్భంలో ఆత్మ పరిశీలనకు పనికి వచ్చే విధంగా కొన్ని అంశాలను నేను ముచ్చటించాను. భారతీయులు త్వరత్వరగా ఎదిగి రావాలనీ, ప్రపంచ ప్రజలు దేనిని మననుండి కోరుతున్నారో దానిని మనం అందించగలగాలనీ నేను కోరుకుంటున్నాను. ఇక మళ్ళీ ఇక్కడి కథమామూలు. రేపటినుండి మీ మధ్య గడిపే అవకాశం నాకు మళ్ళీ లభిస్తున్నది చేసి పెడతానని ఒప్పుకుని వచ్చిన పనులు చాలా ఉన్నాయి. మిమ్మల్ని కలుపుకొని ఆ పనులు నేను పూర్తిచేయవలసి ఉంది. మనం అంతరం కలిసి చేయవలసిన పనులివి. ఈ కర్తవ్య నిర్వహణలో మనం పరిపూర్ణతను సాధించగలమని ఆశిస్తూ శుభాశంసనం చేస్తూ నేనిప్పటికి సెలవు తీసుకుంటున్నాను.

ఉత్తేజితులైన సోదరబృందం మాష్టుగారికి నమస్కరించి ఆశీస్సులు స్వీకరించేటందుకై బారులు తీరి నిలుచున్నారు. ఒక్కొక్కరూ నమస్కరించి గృహోన్ముఖులవుతున్నారు. ఆ దృశ్యం కలియుగ వైకుంఠమైన శ్రీ వేంకటేశ్వరుని కొలువును తలపిస్తోంది.



# అతడూ – ఆయనా

అది విశాఖపట్టణం. డాబాగార్డెన్స్ ప్రాంతం. ఆ ప్రాంతంలో జంక్షన్‌కు దగ్గరగా ఒక ఇల్లు. ఆ ఇల్లు పర్వతగారిది. మధ్యాహ్నం మూడు గంటలవేళ, మధ్యగదిలో మాష్టరుగారికి ఎదురుగా ఒక నడివయస్కుడు దీనవదనుడై కూర్చుని ఉన్నాడు. మాష్టరుగారు అతనివైపు చూస్తున్నారు. ఆ చూపులో కొంత మందలింపు, కొంత ఓదార్పు.

ఆ సన్నిధిలో కూడదీసుకోడానికి ప్రయత్నిస్తూనే ఆ దీనవదనుడు ఇలా అన్నాడు. "అదేమిటో చిత్రం అది ఒక వైభవం. జీవితం ఒక వెలుగు వెలిగింది. ఇంతలోనే అది ఎందుకు మాయమయింది? అదే నాకు అంతుపట్టడం లేదు. ఉన్నట్టుండి ఈ చేతులద్వారా దివ్యశక్తి ప్రసరించింది. నా చేతులతో తాకిన ప్రతివారికీ వ్యాధులన్నీ సమూలంగా నిష్క్రమించాయి. లోకంలోనికి ఈ విచిత్రం పాకింది. ఇక చీమలబారుల్లా జనం. ఎక్కడకు వెళితే అక్కడే. పత్రికలు బ్రహ్మరథం పట్టాయి. జనం బారులు మరింతగా పెరిగాయి. తాకితే చాలు మా జన్మ ధన్యమౌతుందన్నట్లుగా చూసేవాళ్ళు వాళ్లు. నాలో వెలుగు, నా నిండా వెలుగు, నా నుండి వెలుగు ప్రసరించేది. వ్యాధులు పరుగెత్తేవి. లేనివాళ్ళూ వచ్చారు. ఉన్నవాళ్ళూ వచ్చారు. జమిందారులు వచ్చారు. రాజులు వచ్చారు. రాణులూ వచ్చారు. చాలా వ్యాధులున్నవాళ్ళు వచ్చారు. ఎందరో వచ్చారు.

నాలో నాకు శివుడు కనిపించాడు. నీవు నా అవతారమన్నాడు. అందుకే ఈ మహిమ అన్నాడు. నేను శివుడి అవతారాన్నని రూఢి అయ్యింది. వ్యాధులతో పాటు మరీ దగ్గరయినవారికి భవిష్యత్తు కూడ చెప్పడం మొదలుపెట్టాను. వాళ్ళు ఏమేమో అడిగేవారు. అవతార పురుషుడికి ఏదైతే మాత్రం ఏమిటి! లెక్క చేసేవాడిని కాదు.

ఒకరోజున నాకు ఒకటి తోచింది కొద్దికాలంలో ఫలానారోజున ఈ సృష్టికి ప్రళయం వస్తుందని. మళ్ళీ మళ్ళీ తోచసాగింది. నేను శివుడి అవతారాన్ని అయినప్పుడు, లయం నా కర్తవ్యమైనప్పుడు అది ఫలానా అప్పుడు జరుగబోతున్నదని నాకు తోచడంలో ఆశ్చర్యం ఏముంది? అనిపించింది.

కాని... కాని... ఈ వైపరీత్యమేమిటి? ఎందుకని ఆ వెలుగు కనిపించడం మానేసింది? ఎందుకని నా మనస్సుకు విషాదం కమ్ముకొన్నది? ఎందుకని నేను దారుణాతి దారుణమైన దౌర్బల్యస్థితిని అనుభవిస్తున్నాను. ఎందుకని నేను ముట్టుకుంటే వ్యాధులు తగ్గడం లేదు? నాకు అంతా అగమ్యగోచరంగా ఉంది? అక్కడికి జపం చేశాను. ధ్యానం చేశాను. ఆ వెలుగును ప్రసన్నం చేసుకోవాలని చూశాను. నా నుండి ప్రసరించమని వేడుకున్నాను. అయినా ప్రసరించదేం? వ్యాధులు తగ్గవేం?

దారులు చెదరిపోయినాయి. నేను బోర్లా పడిపోయాను. ఒకప్పుడు నేనెక్కడున్నానో అని వెతుక్కుంటూ వచ్చేవారు జనం. ఇప్పుడు నేను ఎక్కడ ఉన్నానో ఎవ్వరికీ అక్కర లేకుండా కుంటాను. ఎందుకని ఇలా జరిగింది? ఎందుకని నేనుఇలా అయిపోయాను. ఎందుకని నానుండి ఆ వెలుగు ప్రసరించడంలేదు. దయచేసి మీరు నాకు వివరించి చెప్పాలి. నాకు మనశ్శాంతి కావాలి. అది మీరివ్వాలి. అది మీరివ్వాలి.

అతని కళ్ళనుండి అశ్రువులు రాలుతున్నాయి. వాటిని తుడుచుకునే ప్రయత్నం చేస్తున్నాడతను. అతనిలోనికి చూస్తూ మాష్టరుగారు ఇలా అన్నారు. మీ స్థితి నాకు అర్థమైంది. దానికదిగా జరుగుతున్న దానిని అలా జరగనిస్తేనే బాగుండేది. మధ్యలో మీరు అడ్డుపడ్డారు. అది ఆగిపోయింది.

"నేనా!" "అడ్డుపడింది నేనా?" అన్నట్లు చూశాడు అతను.

"అవును" అక్షరాలా మీరే!" అన్నట్లుగా తలపంకిస్తూ మాష్టరు గారు ఇంకా ఇలా అన్నారు.

ప్రసరిస్తున్న వెలుగును వెలుగుగా చూడక ఇది నాదీ అని మీకని పించింది. దానికి శరణాగతి చెందవలసిన మీరు దానిని మీ సొత్తుగా భావించారు. అంతేకాక నేను అవతారమూర్తిని అన్న భావం మీలో కలి గింది. నేనూ దైవమే అనడంలో తప్పులేదు. నేనే దైవము అంటే తప్పు. నేనూ దైవమే అని గ్రహించినపుడు మనిషి మహనీయుడు అవుతున్నాడు నేనే దైవము అని అహంకరించినపుడు మనిషి రాక్షసుడవుతున్నాడు. మన పురాణాలలోని రాక్షసుల కథలన్నీ ఏమిటి? వాళ్ళేమీ తక్కువవాళ్ళు కారు. తపస్సంపన్నులే వెలుగును చూసిన వారే. కాని ఆ వెలుగును సొంతం చేసుకుందామనుకున్నారు వాళ్లు. తామే దైవమని అహంకరించారు వాళ్లు. అక్కడే పడిపోయారు. మీరు కూడ.

నిజంగా మనకు దైవదర్శనం లభించింది అనడానికి సంకేతం ఏమిటో తెలుసునా? ఆ స్థితిలో దైవం కానిదంటూ ఇంకేమీ కనబడదు. తానూ దైవమే. తన చుట్టూ ఉన్నదీ ఆ దైవమే. తనయందు, నిఖిల భూతములయందు వ్యక్తం అవుతూ ఉన్నది ఆ దైవమే. అని స్పష్టంగా తెలుస్తుంది. మనయొక్క వ్యక్తిత్వం కరిగిపోయి అస్తిత్వం మాత్రం ఉంటుంది. తనను తాను వేరుగా గుర్తించుకునే జబ్బు అక్కడ ఉండదు. కరిగిపోవలసిన వ్యక్తిత్వం పెరిగిపోయింది అంటే అర్థం ఏమిటి? ఎంతగా పెరిగిపోయింది అంటే ఆ వెలుగు ప్రసరించడానికి కూడ సందు దొరక నంతగా! అంతగా అడ్డుపడి, ప్రసరించకుండా చూసుకొని, ఎందుకని ఇలా జరుగుతోంది అంటే ఎలా?

దైవం నీ నుండి ఒకటి సంకల్పించింది. దానినలానే సాగనిస్తే బావుండేది. ఇదేదో ఎవరికీ లేనిది మనకే ఉన్నదని గర్వించావు. వ్యాధి

బాధలను చూడమని ఉపదేశం చెప్తుంటే అది మాని రాజుల వ్యక్తిగత వ్యవహారాల్లో తలమునకలుగా మునిగిపోయావు నీవు. వాళ్ళ కోర్టుకేసుల బాధ్యతలు కూడా నీవే వహించావు. కోర్టులకుగాను సాక్షుల తయారీ కూడా నీవంత శ్రమించి చేసేందుకు వినియోగించావో అందుకుగాను వినియోగించ గలిగినట్లైతే ఈ వెలుగు నిన్ను విడిచిపెట్టి ఉండేది కాదు. దానికి నిమిత్త మాత్రంగా నిలబడవలసిన నీవు దాని పేరిట అహంకరించి కాని దారుల వెళ్ళావు. ఇప్పుడు బాధపడి ఏమి లాభం?

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. అతడు పశ్చాత్తాపం చెందుతున్నట్లుగా కనిపించాడు. మాష్టరుగారి చూపులు కూడా అతడికేదో ఉపదేశాన్నిస్తున్నట్లుగానే ఉన్నాయి. వెలుగునుండి వెలువడేవన్నీ వెలుగునే పంచుతాయి కదా! అందుకనే ఆ పెద్దల చూపు, స్పర్శ, వారిమాట, మొదలైనవన్నీ చేసేవారిని ఉద్ధరించడానికే వ్యక్తమవుతూ ఉంటాయని అనుభవజ్ఞులు చెపుతూ ఉంటారు. అతడు ప్రస్తుతం ఆ చూపులతో తడవబడుతున్నాడు. అందుకనే అహంకార స్థితినుండి పశ్చాత్తాపం వైపుకు అతని మనస్సు మళ్ళినట్లనిపించింది.

దుఃఖపు గొంతుతో అతడిలా అన్నాడు : నేను కావాలని కోరుతున్నాను కదా! ధ్యానాదులతో ప్రయత్నిస్తున్నాను కదా! మరి వెనుకటిలాగ ఆ వెలుగు నా నుండి మళ్లీ ప్రసరిస్తుందంటారా?

సూటిగా చూస్తూ మాష్టరుగారిలా అన్నారు : నీవు ఏ ప్రయత్నం చేశావని మొదట అది నీనుండి వెలువడింది. అలాంటిదానికి ఇప్పుడు ప్రయత్నం చేయవలసిన స్థితిలో పడ్డావు నీవు. చిత్రంగా లేదూ? ప్రయత్నిస్తున్నాను కదా! మళ్లీ వస్తుందా? అని అడుగుతున్నావు రావచ్చును. రాకపోవచ్చు. ప్రయత్నం మంచిదే. కాని ప్రతి ప్రయత్నాన్ని అది వరించాలని లేదు. అది అనుగ్రహం. ప్రయత్నాలన్నింటికీ అతీతమైన

దది. అది దిగి రావల్సివస్తే నీ ప్రయత్నాన్ని స్వీకరిస్తుంది తప్ప నీవు ప్రయత్నించినప్పుడల్లా అది దిగి రావాలని లేదు. ప్రయత్నం మంచిదే. కొనసాగనీ

తలపైకెత్తి మాష్టారుగారివైపు చూస్తున్నాడాయన. క్రమంగా ఆ చూపులో ఒక విధమైన ఆశ్చర్యం గోచరించసాగింది. అలా చూస్తూనే ఉన్నాడు. అలా చూస్తూనే ఇలా అన్నాడు : మాష్టరుగారూ! మీనుండి ఇంత వైభవం వ్యక్తమౌతోందికదా! మీదగ్గరకు ఇంతమంది ఆకర్షితులౌతున్నారే! కొన్ని వందల కుటుంబాలకు మీరొక ఇలవేల్పుగా గోచరిస్తున్నారుకదా! దేశ విదేశాలలో మీరింత కార్యక్రమాన్ని నడిపిస్తున్నారే? దీనికంతటికీగాను మీరెలాంటి సాధన చేస్తుంటారు. రహస్యమైతే చెప్పవద్దు, చెప్పవచ్చును అంటేనే చెప్పండి.

చిరునవ్వు నవ్వుతూ మాష్టరుగారు ఇలా అన్నారు: ఇందులో రహస్యం ఏముంది? ఈ జీవితం ఒక తెరచిన పుస్తకం. అధ్యాయనం చేసేటందుకు ఇక్కడ ప్రతి ఒక్కరికీ పిలుఉంది. ఇకసాధన అంటావా? నాదృష్టిలో ఈ జీవితమే ఒక సాధన. ఈ దేహం ఆ సాధనకు ఒక సాధనం.

అంటే! అన్నట్లుగా చూశాడు అతను మరింతగా ఆశ్చర్యపడుతూ. ఆ ఆశ్చర్యాన్ని గమనించిన మాష్టరుగారు తాను చెప్పిన దానిని ఇలా వివరించారు: ఉదయమూ, సాయంత్రమూ అందరితో కలిసి నేనూ ప్రార్థన చేసుకుంటాను. ఉదయం ప్రేయర్ తరువాత షోడశోపచార పూజ జరుగుతుంది. అదీ అందరితోకలిసి చేసేదే ఈ ప్రేయరు, పూజ, దినచర్యను దివ్యంగా నడిపేటందుకుగాను కావలసిన నేపథ్యాన్ని రూపొందిస్తాయి. ఆపైన దినచర్య అంతా ఒక అఖండమైన దైవదర్శనంగా కొనసాగిపోతూ ఉంటుంది.

అంటే' అన్నట్లుగా చూస్తూ మరింత ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నాడు అతను.

ప్రేమగా చూస్తూ మాష్టరుగారు ఇలా అన్నారు. "విగ్రహారాధన సజీవ విగ్రహారాధనకు కావలసిన పాత్రతను మనకు అందించడానికే ఉన్నది అందుకనే ప్రేయరు, పూజతగిన నేపథ్యాన్ని రూపొందిస్తున్నాయని నేను చెప్పడం జరిగింది. ఇక ఆపైన నడుస్తున్న ప్రతి సన్నివేశం దైవ విలాసమే. చేరవస్తున్న ప్రతి మనిషి దైవస్వరూపమే. పెద్దలు "జగమే రామమయం" అన్న మాటకు అర్థమిదే! అలా మన జీవితం రామమయం, ప్రేమమయం కావాలి. నేను చేస్తున్న సాధన అదే. చేస్తున్నాను అనడంకన్నా అది నానుండి జరుగుతూ ఉన్నది.

మీరు చెప్పింది బాగుంది. మరి ఆచరణలోనికి వచ్చేసరికి మంచి వాళ్ళుంటారు. చెడ్డవాళ్ళుంటారు. అందరినీ దేవుడిగా చూడటమంటే ఎలా సాధ్యమవుతుంది? అని అడిగాడతను అతని చూపులు ఉత్సుకతను ప్రకటిస్తున్నాయి.

ఉల్లాసంగా చూస్తూ మాష్టరుగారు ఇలా అన్నారు మంచి ప్రశ్న వేశావు. ఈ సాధనకు మంచి చెడులు అడ్డురావు. దైవాన్ని దర్శిస్తూనే ఎవరికి తగినట్లుగా వారితో ప్రవర్తించాలి. దేవుడి విగ్రహాన్ని చింతపండు, బూడిద వేసి తోమడానికి మనం జంకడం లేదుకదా! ఆ తోముతున్న క్షణాల్లోకూడా అది దేవుడి విగ్రహమన్న స్పృహ మననుండి జారిపోవడం లేదుకదా! అది జారిపోకుండానే విగ్రహం బాగుండాలని మరింతగా అదిమిపెట్టి మరీ తోముతున్నాంకదా! లోకం యెడల మన ప్రవర్తన సరిగా అలాగే ఉండాలి. మంచికి తగినట్లు మంచితో, చెడుకి తగినట్లు చెడుతో మనం ప్రవర్తిస్తూనే అఖండమైన దైవదర్శనాన్ని దినచర్య నుండి అనుభవించవచ్చు. ఇలా అనుభవించడం చేతనైనకొద్దీ మన దిన

చర్య యొక్క పన్నా పెరుగుతుంది. సృష్టిప్రణాళికతో దానికి ప్రతి కుదురుతుంది ఈ సృష్టి కార్యక్రమమే మన జీవితకార్యంగా రూపొందు తుంది. ఆ రూపొందిన క్షణాలలోని దివ్యానుభూతిని రుచి చూడటానికే మనం ఈ దేహాలను స్వీకరించి దిగివచ్చేది.

బోధపడుతున్నట్లుగా చూస్తూనే అతడిలా అన్నాడు: లోకాన్ని దైవస్వరూపంగా చూడాలి అన్నారు మీరు. మరి మనమూ దైవస్వరూపమే నని పెద్దలు చెబుతున్నారు కదా! మరి ...అన్వయం ఎట్లా కుదురుతుంది?

చూపులతో వెలుగులను వెదజల్లుతూ మాష్టరుగారు ఇలా అన్నారు: మామూలు స్థితిలో అనుకోడానికి మాత్రమే పనికొస్తుంది నీవన్నది. నేను వివరించిన సాధన మనలో జరిగినప్పుడు మాత్రమే నీవన్న మాటకు నిజ మైన అన్వయం కుదురుతుంది. ఎలాగో తెలుసునా? లోకాన్ని దైవంగా దర్శించడం మొదలుపెట్టాలని చెప్పాను. ఆ దర్శనం కొనసాగుతున్నప్పుడు ఆ అనుభూతి తనదాక కొనసాగి అంటే అతని మనస్సు హృదయాన కరిగి తానూ ఆ దైవంలోని భాగమే నన్న నిజం మానవుడికి అనుభవం లోనికొస్తుంది. అపుడు లోకమంతా తనమయము. ఇక నడిచేది తన్మ యత్వమే. అలాంటి తన్మయి స్థితిలో జీవితం తైలధారవంటి అఖండ అనుభూతిగా యజ్ఞార్థంగా సాగిపోవాలని శ్రీకృష్ణుని నుండి భగవ ద్రామానుజుల వరకూ పెద్దలందరూ చేసిన బోధ. నేను దైవము అని అనుకొన్నప్పుడు అది అహంకారం నేను దైవము అన్నస్థితి అనుభవాని కొచ్చినపుడు అది ఆత్మ దర్శనం. అనుకొనే స్థితినుండి అనుభవించే స్థితికి ఎలా ప్రయాణం చేయాలన్నదే ఇంతవరకూ నేను చెప్పింది.

"మిమ్మల్ని చూస్తుంటే చిత్రంగా ఉంది. ఇంత సూటిగా ఎలా చెప్పగలుగుతున్నారుమీరు!" అన్నాడతను అబ్బురపడుతూ.

"సూటిగా చూస్తున్నారు గనుక" అన్నారు మాష్టరుగారు, అతనిని చూపులతో తడుపుతూ.

"ఇంకొక్కమాట అడగనా? అన్నాడతను."

ఇన్ని అడిగినవాడికి ఆ సంకోచమెందుకు? అడుగు? అన్నారు మాష్టరుగారు.

మీరు చెప్పిన సాధనా విధానానికి, సమన్వయానికి నా జోహార్లు. దానికిక తిరుగులేదు. ఇప్పుడు నేనడగబోతున్నది మీరింత పెద్ద వ్యవహారం పెట్టుకున్నారుకదా! లౌకికంగా, ఆర్థికంగా దీనినంతా ఎలా సంబాళిస్తున్నారని. దర్శనంతో పాటు ఎంత ఒడుపు ఉంటే ఈ కార్యక్రమం నడుస్తుంది?

కుర్చీలో వెనక్కివాలుతూ మాష్టరుగారు ఇలా అన్నారు. నేను చెప్పిన సాధన సత్కర్మాచరణ రూపంగా సాగినపుడు వనరులకై వెతుకులాడవలసిన పని ఉండదు. వాటికవిగా నడిచివచ్చి మనను చేరుకుంటాయి. ఎవరైన దీనిని అవలంబించి చూడవచ్చును. లోకానికి కావలసిన పని మన నుండి జరుగుతున్నప్పుడు మనకొరకుగాని, మననుండి జరుగుతున్న కార్యక్రమం కొరకు గాని, వనరులకై దేవులాడవలసిన పని ఉండదు. ఇది నా అనుభవం.

ఇదిగో దైవం ఈ సి.వి.వి గారి రూపంలో నాకు సాక్షాత్కరించాడు నాకు కావలసినవన్నీ ఈ ఫోటో వెనుకనుండి వచ్చేస్తుంటాయి. ఇది నా అనుభవం. వందలు అవసరమైన రోజున వందలు వస్తాయి. వేలు అవసరమైన రోజున వేలు వస్తాయి. అవసరానికి తగినట్లుగా అవి అమరుతూ ఉంటాయి. అవసరముంటేనే వస్తాయి. అవి రాలేదూ అంటే అవసరం లేదని అర్థం. అవసరాన్నిబట్టి వస్తాయి. మన కోరికను బట్టి మాత్రం రావు. అసలు కోరికలు కరిగి

పోయిన వాళ్ళకే అవసరాలంటే ఏమిటో తెలుస్తాయి. చాలాసార్లు మనం కోరికలనే అవసరాలని అనుకుంటూ ఉంటాం. నేను చెప్పినట్లుగా సాధన సాగినపుడు కోరికలు కరిగిపోతాయి. అవసరాలు తీరిపోతాయి. నీకేది కావాలో నీవు గమనించేలోపలే అది నీ దగ్గరకు చేరుకుంటుంది ఇది ఈ జీవితానుభవం. ఈ జీవిత సందేశం. ఇంక చాలుననుకుంటాను నీకు కావలసింది నా నుండి లభించింది అనుకుంటాను. ఈ ప్రశాంతత క్రమంగా నిన్ను నిలబెట్టగలదు. ఆ ప్రశాంతతలో స్థిరపడు.

త్వరపడటం కాదు స్థిరపడటం కావాలి. అప్పుడు నీకేం కావాలన్నది నీవు చెప్పవలసింది కాదు. అది దైవం నిర్ణయించవలసింది. మళ్ళీ కలుసుకుందాం. నేను వెళ్ళిరానా మరి? అని అంటూ, అంటూనే లేచి నిలబడిన మాష్టరుగారి పాదాలపై అతడు అప్రయత్నంగా మోకరిల్లాడు. ఆ పాదాన్ని తనకు కావలసిన పథం చూపవలసిందిగా, తనను నడపవలసిందిగా అర్థిస్తున్నట్లుగా ఉన్నది ఆ నమస్కారం.

అనుభూతి బాష్పాలతో పాదాలను కడుగుతున్న అతన్ని చేతులతో పట్టిలేపి అక్కున చేర్చుకున్నారు మాష్టరుగారు. అతడు ఆయనలో అలా ఒదిగిపోయాడు.



# పచ్చి కాస్తా పండొరి

అది చిన వాల్తేరు కాలనీలోని మాష్టరుగారి ఇల్లు. రాత్రి పది గంటలు దాటుతోంది. పనులన్నీ చూసుకునివచ్చిన మాష్టరుగారు, అప్పుడే మంచంమీద కూర్చుని ప్రక్కనున్న వారితో సరసోక్తులాడుతున్నారు. ముందుగదిలో కూర్చున్న సన్నిహితులొకరు మెల్లగా మాష్టరుగారి చెంతకు చేరుకున్నారు ఆయన మాష్టరుగారికి చాల దగ్గరివారు. అన్ని విధాలా దగ్గరవారు.

"మధ్యాహ్నం కొంత చెప్పాను గదా! అదే! వాళ్ళ సంగతి. వాళ్ళు ఎందుకలా ప్రవర్తిస్తున్నారో నాకు అంతుపట్టడంలేదు. నేనేం చేసాను? వాళ్ళు నమ్ముతున్న సిద్ధాంతాన్ని శాస్త్రీయంగా విశ్లేషించాను. ఆ సిద్ధాంతానికి పునాదులూ లేవు. గమ్యమూ లేదని నిరూపించాను. ఇదంతా వాళ్ళకు అర్ధం కావాలనే చేశాను. అర్థం చేసుకోవలసింది పోయి వాళ్ళెందుకలా వ్యతిరేకతను ప్రదర్శిస్తున్నారు ఆల్‌మోస్ట్ వాళ్ళు నాకు శత్రువులుగానే ప్రవర్తిస్తున్నారు.

కావాలని వస్తారు నా దగ్గరకు. ఏదో మాటలు మొదలుపెడతారు. మధ్యలో అనుభూతుల ప్రసక్తి వస్తుంది. నేను పొందిన అనుభూతులు వాళ్ళకు చెబుతాను. వాళ్ళు నమ్మరే! పైగా ఆ అనుభూతులు వాళ్ళకు చూపించమంటారు. అదెలా సాధ్యం? అవి ఎవరికివారు పొందవలసినవి కదా! "ఈ మార్గాన కృషి చేయండి, మీరూ పొందుతారు "అంటాను." అదంతా మాకు అనవసరం. మీకు కలిగాయి అంటున్నారు. కాబట్టి మాకూ చూపించండి. లేకపోతే మేం నమ్మం." అంటారు వాళ్ళు. వితండ వాదులకు చెప్పగలిగిన వాళ్ళెవరు?

వితండవాదులకు దండిగా జవాబులు చెప్పి, మొండిగాఎదురు తిరిగి, ఎక్కడెక్కడి అంశాలో పట్టుకొచ్చి, వాళ్ళను అక్కడికక్కడే నోరు

మాయించే శక్తిగల వ్యక్తి ఒకాయన ఉన్నాడని తెలిసింది. స్నేహితుల ప్రోద్బలంతో అతణ్ణి రంగంలోనికి దింపారు. అతడు ఉద్దండుడై విజృంభించాడు. అతడి ఉపన్యాసాలు జరిగినంతకాలం ఆ నాస్తిక సమూహం వచ్చారు కాని, ఎవ్వరూ కిక్కురుమనలేదు. కొంతవరకు సంతోషమైంది. సరే ఆ ఉపన్యాసకుడికి ముట్టచెప్పగలిగినంత ముట్టచెప్పి సాగనంపాను. అతడు వెళ్ళిన మరునాడే మళ్ళీ వచ్చారు వాళ్ళు. "మేము వాదించదలచుకున్నది ఆయనతో కాదండీ! మీతోనే"— అన్నారు. అందుకనే మేము ఆయనతో ఘర్షణ పడలేదు! అన్నారు. కథ మళ్ళీ మొదటికి వచ్చింది.

ఎందుకు వాళ్ళిలా ప్రవర్తిస్తున్నారు? ఒక రకంగా వాళ్ళు నన్ను వేధిస్తున్నారు. నేను చేసిందేమిటి? "ఇది మంచి" అని చెప్పాను. "తెలుసుకుని బాగుపడండి" అన్నాను. వాళ్లు ఎందుకని గ్రహించలేకపోతున్నారు. ఏం చేయాలో నాకు పాలుపోవటం లేదు. ఎందుకని ఇలా జరుగుతోంది?"

ఆయన ముఖంలో ప్రశ్నార్థకం గోచరిస్తోంది. ప్రశాంతవదనులై కూర్చున్న మాష్టరుగారి వైపు సమాధానం కోసం చూస్తున్నారు ఆయన. "సమాధానపరిచే సమాధానం వచ్చే చోటు ఇదీ!"— అని ఆయనకు తెలుసు. అందుకనే తన మనస్సులోనిదంతా మాష్టరుగారి ముందు వెళ్ళబోసుకున్నారు.

చిరునవ్వు నవ్వుతూ మాష్టరు గారిలా అన్నారు : అడిగావు కాబట్టి చెబుతున్నాను. ఏమీ అనుకోవు కదూ! నీలో ఇంకా కొంత అవగాహన రావలసింది ఉంది. అదేమిటంటే నాస్తికులు అంటే నీ మనస్సులో కొంత "ఎవర్షన్" ఉంది. ఆ గిట్టని తనం ఉండటంతో వాళ్ళు నీమీద సవాళ్లు చేయడం జరుగుతోంది. ఒక్కసారి ఆత్మపరిశీలన చేసుకో. నువ్వు వాళ్ళతో వాదిస్తున్నావా? వాళ్ళకు తెలియజెప్పుతున్నావా? ద్వేషభావం ఉన్నప్పుడు వాదిస్తాం. ప్రేమతత్వం నిండినపుడు తెలియజెపుతాం. కనుక

మనలో ఆ కాస్త పచ్చి కూడా పండవలసి ఉంది. పండిననాడు వాళ్లెవరూ నీపైన తిరగబడరు. వస్తే నీ వెంట వస్తారు. లేదా వాళ్ళకు నచ్చినట్లుం టారు నిన్ను ద్వేషించరు ఒకరి సిద్ధాంతం మనకు నచ్చనంత మాత్రం చేత మనం వారిని ద్వేషించనక్కరలేదు ఈ సత్యాన్ని ముందు మనం గమనించి అమలు పరచాలి. అప్పుడు క్రమంగా అవతలివాళ్ళు కూడా అమలుపరుస్తారు. సిద్ధాంతంతో నిమిత్తం లేకుండా, ఒకరినొకరు ప్రేమించుకోవటమనేది, గౌరవించుకోవటమనేది అప్పుడు జరుగుతుంది.

ఇక రావలసిన మేలుకొలుపు అంటావా! కాలక్రమంలో అదే వస్తుంది మనలో ఎలా వచ్చింది? వాళ్ళలోనూ అలాగే వస్తుంది. మన స్నేహహస్తాన్ని వారికి అందించి, వారిలో రావలసిన మేలుకొలుపుకు దోహదం చేయాలి తప్ప, వాదించి ఏం లాభం? ఆ దోహదం కూడా సహజంగా ఉండాలి. జరుగుతున్నట్లు వారికి తెలియనక్కరలేదు. మండు తున్న కట్టెపేడుతో, పండవలసిన కట్టెపేడు చేరినప్పుడు ఏం జరుగు తోంది? అలా ఉండాలి.

ఈ నా మాటలు నీకు బోధపడ్డాయనుకుంటాను. ఈ చిన్న మార్పు నీలో వస్తే చాలు. ఇక కథ దారికి వస్తుంది. ఏమంటావ్?

మాష్టరుగారు సూటిగా చూస్తున్నారు. ఆ చూపులు ఎంత సూటిగా ఉన్నాయో అంత హాయిగా కూడా ఉన్నాయి. అతని మనస్సులో మిగిలిన ఆ కొద్ది ద్వేషాన్ని కరిగించి, ప్రేమగా రూపొందిస్తునట్లున్నాయి. గొంగళిపురుగు సీతాకోకచిలుకగా రూపొందుతున్న వేళ, ఆ ప్రక్రియను పూర్తి చేస్తున్నట్లుగా ఉన్నాయి.

అర్థమైంది నాకర్థమైంది. నాకు కావలసిన జవాబు దొరికింది. ఇక ఈ జీవితం దారిన పడుతుంది. ఇంతవరకూ నచ్చినదానిని ప్రేమించాను నేను. ప్రేమ గలవాడికి నచ్చనిదంటూ ఏమీ ఉండదని ఇప్పుడు తెలుసు

కున్నాను. తోటి వ్యక్తులను మనలోని ప్రేమ పొదుగుతుంది. మనలోని ద్వేషం రెచ్చగొడుతుంది ఇప్పుడు నాకర్థమైంది. నాకు హాయిగా ఉంది. బరువు దిగిపోయినట్లుంది. మనస్సుతో పాటు శరీరం కూడా తేలికపడింది. ఒకానొక హాయి నన్ను ముంచెత్తుతోంది. ఆహా! ప్రేమ ఎంత హాయిగా ఉంటుంది. ఆ హాయిని మనలో వెలిగించే సన్నిధి ఇంకెంత హాయిగా ఉంటుంది. ఇదిగో! ఇంత హాయిగా ఉంటుంది." అనుకొంటూ అతడు మాష్టరుగారి పాదాలపై వాలిపోయాడు.



# ఏది ముఖ్యం ?

మధ్యాహ్నం మూడు గంటలు దాటింది. అప్పుడు మాష్టరుగారు విశాఖలో, నీలమ్మ వేపచెట్టుకు దగ్గరలో ఉంటున్నారు. ఇంటి వరండాలో ఒకామె కాలు కాలిన పిల్లిలా తిరుగుతోంది. వయస్సు నాలుగు పదులు దాటి ఉంటుంది. ముఖంలో ఏదో ఆందోళన కళ్ళు ఎర్రబడి ఉన్నాయి. శరీరాన్ని నిలకడగా ఒకచోట ఉంచలేక పోతోందామె. మాష్టరుగారెప్పుడు బయటకు వస్తారు? ఆయన వస్తే తాను వచ్చిన పని పూర్తవుతుంది గదా? అన్న ఆత్రుత ఆమెలో నిలువెల్ల కనబడ తున్నది. అసలి దంతా ఎందుకు వచ్చింది? అన్నట్లు చూస్తోందామె. విషయమేదో తేల్చి వేయాలి అన్నట్లు చూస్తోంది.

ఇంతలో ఒక కుర్రవాడు "మాష్టరుగారు కాసేపట్లో బయటకు వస్తారు" మీరు అలా ఆ కుర్చీలో కూర్చోండి" అన్నాడు.

"ఎలాగూ వస్తున్నారు కదా! ఇంక కూర్చోవటం ఎందుకు లెండి మాట్లాడివెళ్ళి పోతానన్నట్లుగా చూసిందామె.

మాష్టరుగారు బయటకు వచ్చి కుర్చీలో కూర్చుంటూనే, "ఏమమ్మా ఏమిటి విశేషం!" అని అడిగారు ఆమెవైపు చూస్తూ.

ఆవేశం ఆమెను ముంచెత్తుతున్నది. ఎంతో మాట్లాడాలని, ఏవేవో అడగాలి అని ఆమె ఉద్దేశం. కాని ఎందుకనో ఆమెకు మాట పెగలటం లేదు. మాట్లాడేయాలి అన్న ఆవిడ ఆవేశమే ఆవిడ మాట్లాడటానికి అడ్డుపడుతోంది. అతికష్టం మీద మాట్లాడటానికి ఉపక్రమిస్తూ, "అదేనండీ! మా అబ్బాయి గురించి మీతో కొన్ని విషయాలు మాట్లాడదామని వచ్చాను." అన్నది.

ఆమె లోనికి సూటిగా చూస్తూ మాష్టరుగారిలా అన్నారు. మీరు ఎందుకు వచ్చారు. అన్న అంశం నాకు తెలుసును. నేను మిమ్మల్నొక మాట అడుగుతాను. చెప్పండి. "ఇంత వరకు మీరు మీ జీవితంలో సుఖ పడ్డారా?"

ఆ ప్రశ్నకు ఆవిడ ఉద్దరిల్లింది. ఆవిడ మనస్సు గుడుసుళ్ళు తిరిగింది. ఎగసి పడదామనుకున్న ఆవేశం ముందుకు దూకే అవకాశాన్ని కోల్పోయి తనంతనికి తానే దిగిపోవలసి రావటంతో ఆమెలోని అణువణువు కంపించి పోయింది. అంత ఆవేశం ఇంతవరకు ఆవిడలో పెల్లుబికింది గదా! చిత్రం. చెప్పలేని అశక్తత ఏదో ఆవిడ ముఖంలో వ్యక్తమవుతోంది, ఇప్పుడు.

కొన్ని క్షణాలలా నిశ్శబ్దంగా గడిచాయి.

మాష్టరుగారు మళ్లీ ఇలా అన్నారు. ఏమమ్మా! నీవింత వరకు సుఖపడలేదుకదా! సుఖపడటం నీకు చేత కాలేదు కదా! అసుఖపడటానికి కావలసిన దారి ఇంతవరకు నీకు దొరకలేదు కదా! మరి అలాంటి నీవు నీకొడుకు నీ మాట వినలేదని బాధపడటంలో అర్థం ఉన్నదా ?

ఆమె ముఖం మరింత వివర్ణమయింది. తెలియని కంపమేదో ఆమెలో చోటు చేసుకున్నది. క్రమంగా ఆకంపం మరింత తీవ్రమవు తోంది.

మాష్టరుగారు ఇంకా ఇలా అన్నారు. సుఖపడటం చేతకానప్పుడు బిడ్డలు మన మాట వినాలి అంటే అర్థమేమిటి? వాళ్లు కూడా సుఖపడకుండా పోవాలనా? మీరెలాగూ సుఖపడలేరు. వారైనా సుఖపడే దారికి చేరుకున్నప్పుడు మీరు హర్షించాలి కదా! ఎందుకని ఇంత వెన్ష పడుతున్నారు! నాకు తెలుసును. మీరెందుకు వెన్షపడుతున్నారో? మన

బిడ్డ మన మాట వినక పోవటమేమిటి? అన్నబాధ మీకు కలిగింది. మీ లోని అహంకారానికి దెబ్బతగిలింది. కొంచెం నిదానించి ఆలోచించండి. మీ మాట వినటంలేదూ అన్నమాటగాని, ఇప్పుడు మీ అబ్బాయి చెడి పోయిందేముంది? అబ్బాయి చెడిపోయినా సరే నామాట వినటమే నాకు కావాలి అన్నది మీ కోరిక. అంతేనా? నేను దీనిని మూర్ఖత్వం అంటాను. పిల్లవాడు బాగు పడటం ముఖ్యమా? మన మాట వినటం ముఖ్యమా? ఏది ముఖ్యం? ఆలోచించుకోండి:

మరో విషయం "అపిల్లవాడు మీ ఇష్టప్రకారం నడుచుకోవటం లేదు. కనుక అతని కేమీ సహకరించం." అని చెప్పటానికి కూడ వచ్చారు మీరు అవునా?

ఆమె ముఖంలో అశక్తతతో పాటు ఆశ్చర్యం కూడా గోచరిం చింది. మనిషిని నిలబెట్టి చదివేస్తున్నాడే ఈయన కడిగేస్తున్నాడే ఈయన అన్నట్లుగా చూస్తున్న దామె. కొంత అశక్తత, కొంత అసహనం, కొంత ఆశ్చర్యం ముప్పేటగా కనబడుతున్నాయి ఆమె ముఖంలో.

మాష్టరుగారు మళ్ళీ ఇలా అన్నారు. ఇంత వరకు మీరు సహక రించారు సంతోషం. ఇప్పుడతనికీ వయస్సు వచ్చింది. ఇకపైన మీకు అతడు సహకరిస్తాడు. ఇప్పుడిక అతని వంతు. ఇక అతడు మీకు చేయ వలసినదే మిగిలి ఉన్నది. మీరిక వెళ్ళిరండి.

ఆమెకు ఏమి చెప్పాలో పాలుపోలేదు. ఆయన చెప్పిన దంతా సత్యమే. కాని అంగీకరించటానికి ఆమె మనస్సు ఒప్పటం లేదు. ఆమె అలాగే నేల చూపులు చూస్తూ ఇంటి దారి పట్టింది. అలా నడచి వెళు తున్న ఆమె వైపు ప్రేమగా ఒక్కసారి చూశారు మాష్టరుగారు. ఆ చూపే ఆమెను వెన్నంటి నడచి భావి కాలంలో కావలసిన చిత్తశాంతిని ఆమెకు అందించ గలదు. అనిపించింది.

# కాలానికి అప్పచెబుదాం

"రా! కృష్ణస్వామీ. కూర్చో." అన్నారు మాష్టరుగారు.

సమయం సాయంత్రం నాలుగు గంటలవుతోంది.

కాఫీ కప్పును అందుకుంటూ ఇలా అన్నారు మాష్టరుగారు: నీవు మెట్లెక్కుతూ ఉండగా, దిగుతూ మన వాళ్ళు కొందరు కనబడి ఉండాలే!

"కనబడ్డారండీ!" అన్నాన్నేను.

"ఏమన్నారు!"

"ఏమంటారు. నన్ను చూసి నవ్వారు. నేనూ నవ్వాను. ఇప్పటికే లేటయింది కదా! నేను రావటం. అందుకని వేరే కబుర్లేమీ పెట్టుకోలేదు".

"ఆ వేరే కబుర్లేవో వాళ్ళే చెప్పార్లే. నీవు లేటుగా రావటాన్ని ఇవాళ వాళ్లు సద్వినియోగం చేస్కుకున్నారు. ఏమిటి అలా నవ్వుతావ్? ఏమిటని అడగవే?"

"చెప్ప వలసింది ఏమైనా ఉంటే మీరే చెపుతారు కదా!"

"మరీ ఇంత అమాయకంగా ఉన్నా ఇబ్బందే సుమా!"

"ఇబ్బందుల పాలిట పడకుండా చూడటానికి మీరున్నారుగా!"

"ఆఁ. ఆఁ, ఇవాళ అదే జరిగింది. నీవేమో నీదారిని నీవు పోతూ ఉంటావు. ఇటూ, అటూ ఏం జరుగుతోందో కూడా పట్టించుకోవు."

"పట్టించుకుంటూ ఉంటే ప్రయాణవేగం తగ్గిపోదూ!"

"పట్టించుకోక పోవటం వల్ల అసలు ప్రయాణానికే అడ్డం వస్తే?"

"మీ అధీనంలో, మీ ప్రకారం జరుగుతున్న ఈ ప్రయాణానికి ఏదీ అడ్డురాదు. ఈ ప్రయాణాన్ని ఏదీ ఆడ్డుకోలేదు"—అన్న ధైర్యం నాకుంది."

"నీ విశ్వాసం బాగానే ఉన్నది. కాని అప్పుడప్పుడు నీలోని నియోగాన్ని కూడా నీవు వాడుకుంటూ ఉండాలి."

"నాలోని నియోగ మంతటినీ వినియోగించ వలసిన వారు మీరే!"

"ఓరీ! ఇదే నియోగ మంటే. అదే వాళ్ళకు అర్థం కావటం లేదు. కనుకనే వాళ్లు గింజుకు పోతున్నారు"—అంటూ నా కన్నులలోనికి సూటిగా చూసారు మాష్టరుగారు.

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఆయన చూపులు నా తను వంతటిని తడుముతూ సాగుతున్నాయి. ఒడలెల్ల పులకించి పోతోంది. అనుభూతితో ఒరిగిన కనురెప్పలు, మళ్ళీ పైకి వెళ్ళటానికి ఇష్టతను చూపటం లేదు.

అనుభూతిని శబ్దంగా రూపొందిస్తూ మాష్టరుగారు మంద్ర స్వరంలో ఇలా అన్నారు: ఏమిటో పిచ్చివాళ్ళు. చెప్పినా అర్థంకాదు వాళ్ళకి. చెప్పినా అర్థంకాని వాళ్లని వాళ్లకు చెప్పవలసింది చెప్పి, ఇక కాలానికి వదిలేయాలి. ఆ చెప్పబడిన దానిని అర్థమయ్యేటట్లుగా చూసే బాధ్యతను ఇక ఆ కాలమే స్వీకరిస్తుంది

"వాళ్లేమిటేమిటో చెబుతారు నీవేదో చేస్తున్నావంటారు. నీవొక బృందాన్ని వేరే రూపొందిస్తున్నావట. ఎక్కడ బడితే అక్కడ వైద్యాలయాలు పెట్టేస్తున్నావట. అవన్నీ నీచేత మానిపించ మంటారు. ఏం చెప్పాలి వాళ్లకి."-అని నావైపు అలా చూస్తున్నారు మాష్టరుగారు.

"మాష్టరుగారూ! నేను మీకు చెప్పకుండా ఏమైనా చేసానా? జరిగింది ఏమైనా మీకు చెప్పకుండా ఉన్నానా? మీ సంకల్పానికి విరుద్ధంగా నేనెప్పుడైనా ప్రవర్తించానా? మీ రుద్దేశించని ఏ కార్యక్రమాన్నైనా నేను చేపట్టానా?"

"లేదు. అంతా నా ఇష్టప్రకారమే జరిగింది."—అన్నట్లుగా తల ఊపారు మాష్టరుగారు.

మళ్లీ కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

తలను కొంచెం పైకెత్తి దృష్టిని పై వైపుకు సారిస్తూ మాష్టరుగారిలా అన్నారు: "ఇదంతా ఏం లేదోయ్. తోటి వాడికి ఇంతగా పేరు ప్రతిష్టలు రావడమేమిటి ? అని బాధ. నువ్వు ఏమేమో చేసి, కావాలని ఈ పేరు ప్రతిష్ఠలను సంపాదించు కుంటున్నావని వాళ్లకి ఒక అనుమానం."

ఇంతకూ పేరు ప్రతిష్ఠలూ అంటే వీళ్లకొక అవగాహన ఉన్నట్లుగా నాకనిపించదు. అవి అంటే ఆ పేరు ప్రతిష్ఠలు మనం రమ్మంటే వచ్చేవీకావు. మనం వద్దంటే మానేవీ కావు. కేవలం దైవానుగ్రహమే, దైవలీలా విశేషమే— ఆ పేరు ప్రతిష్ఠలుగా రూపాన్ని ధరిస్తూఉంటుంది. అలా మనిషిని వరిస్తూ ఆవరిస్తూ ఉంటుంది.

ఇంతకూ ఆవరించిన పేరు ప్రతిష్ఠల వల్ల వరింపబడిన వ్యక్తికి ప్రయోజనం ఏమిటి? ఆలోచించు. నిజానికి ఏమీ లేదు. పేరు ప్రతిష్ఠల వల్ల ప్రయోజకుడైన ఒక వ్యక్తిని గూర్చి దూర ప్రాంతాలకు కూడా తెలుస్తుంది ఆ దూర ప్రాంతాలలో ఉన్న ప్రజలు కూడా ఆ వ్యక్తిని గూర్చి విని, అతడికి దగ్గరై తమకు కావలసిన ప్రయోజనాన్ని పొందటానికి వీలవుతుంది మంచి పని చేస్తున్న ఒక వ్యక్తిని, వీలైనంత ఎక్కువ మందికి వినియోగించ దలచినప్పుడు, ప్రకృతి అతనికి పేరు ప్రతిష్ఠలను అనుగ్రహిస్తుంది. అంటే ఏమిటి? పేరు ప్రతిష్టలు అన్నవి ఒక ప్రయోజకుడైన వ్యక్తికీ, లోకానికీ మధ్యలో ఒక కనెక్షన్‌గా పని చేస్తున్నాయన్నమాట. ఆ ప్రయోజకుడు పది మందికీ పనిచేసిపెట్టే వీలును కల్పిస్తున్నాయన్నమాట. ప్రకృతి ఆ వ్యక్తికి మరిన్ని బాధ్యత

లను అప్పుజెప్పుతూ ఉన్నదన్నమాట అతడి జీవితం ఇలా సద్వినియోగం చేసుకుంటు న్నదన్నమాట.

సత్యం ఇలా ఉండగా పేరు ప్రతిష్ఠలంటే ఏమేమో అనుకొని, అవి తమకు రాలేదని కొందరు కంగారు పడిపోతూ ఉంటారు ఎలాగైనా తామూ తెచ్చుకోవాలని కొందరు తాపత్రయపడి పోతుంటారు. కనీసం అవి వస్తున్న వాళ్లకైనా అడ్డుపడి కొంత వరకైనా వాటిని ఆపుదామని ఇంకొందరు దారుణ రూపాలను ధరిస్తూ ఉంటారు. ఈ ధరించటం వల్ల వీళ్లు ఎవరిని చూసి దుఃఖిస్తున్నారో, వారి పేరు ప్రతిష్ఠలు మరింతగా వ్యాప్తి చెందటానికి వారే కారణమవుతుంటారు. ఇదొక చిత్రం.

నువ్వేమీ మనస్సులో పెట్టుకోకు. మనలా పని చేసుకుంటూ పోతున్న వాళ్లకి ఈ సన్నివేశాలన్నీ సహజంగా ఎదురయ్యేవే. మన పని మనం చేసుకుంటూ పోవడమే ఇప్పుడు మనం చేయవలసినది. మిగిలిన అంశాలన్నింటినీ పరిష్కరించటానికి కాలం ఉన్నది.

అదీ కథ. బాగుంది కదూ! ఇక కాగితాలు తీయి. మన పనిలోనికి మనం ప్రవేశిద్దాం. అంటూ ఆయన పనివేళా లేచి దగ్గరకు వచ్చి నా వెన్ను నిమురుతూ, అలా ఉండిపోయారు కాసేపు.



# చేస్తే అలాచెయ్యి

ఒక చేతిలో రసీదు పుస్తకాల కట్ట, మరొక చేతిలో లెటర్ హెడ్ హ్యాడ్స్ కట్ట పట్టుకొని ఒక సలభై ఏళ్ళ నడివయస్కుడు మాష్టరుగారి గదిలోనికి ప్రవేశించాడు.

అలా ఆ కట్టలు పట్టుకునే చేతులు జోడించే ప్రయత్నం చేస్తూ, "నమస్కారం మాష్టరుగారూ!" అని కట్టలు క్రిందపెట్టి నిలబడ్డ అతనిని చూపులతోనే కూర్చోవలసిందిగా సూచించారు మాష్టరుగారు.

కొద్ది క్షణాల తరువాత తానప్పటికి చేస్తున్నపనిని కొంచెం ప్రక్కగా పెట్టి, "ఏమిటోయ్ ఇలా వచ్చావ్? ఈ పుస్తకాల కట్టలూ అవీ ఏమిటోయ్?" అని అడిగారు.

తిరిగి చేతులు జోడిస్తూ, తాను కూర్చున్న ఆసనాన్ని మాష్టరుగారికి దగ్గరగా జరుపుకొని, వినమ్రంగా కూర్చుంటూ, "మాష్టరుగారూ! మీకు చెప్పకుండా ఒక చిన్న మంచిపని చేసానండి? అందుకు మీ ఆశీస్సులు కావాలి" అన్నాడతను. అంటూనే పాదాల చెంతకు వంగాడు. చేతులతో మాష్టరుగారి పాదాలను స్పృశించి కన్నులకు అద్దుకుంటున్నాడు. ఆ పుస్తకాల కట్టలను కూడా ఆ పాదాలకు తాకించే ప్రయత్నం చేస్తున్నాడు.

కట్టలతో సహా అతణ్ణి అలా ఆపి, అలాచేయడం కట్టిపెట్టమని కన్నులతోనే వారిస్తూ, "ఇంతకీ ఈ హడావిడేమిటో చెప్పు మహానుభావా! నువు కంగారు పడిపోతున్నావ్. నన్ను కంగారు పెట్టాలని చూస్తున్నావ్. కూర్చో, అలా ప్రశాంతంగా కూర్చొని సంగతేమిటో చెప్పు."

"ఏంలేదు మాష్టరుగారూ! మీ అనుమతి తీసుకోకుండా ఒక చిన్న పని చేసాను. నా మీద ప్రేమతో మీరా పనిని అనుమతించి, ఆశీర్వది

చాలి." అంటూ అతను రశీదుల పుస్తకం ఒకటి, లెటర్‌హెడ్ ప్యాడ్ ఒకటి, మాష్టరుగారి చేతిలో పెట్టాడు. పెట్టి ఉత్కంఠతతో మాష్టరుగారి వైపు అలా చూస్తూ ఉండిపోయాడు.

మాష్టరుగారు ఆ రెండు పుస్తకాలను తెరచి చూసారు. తెరచి అలా చూస్తూ చూస్తూ ఉండగానే ఆయన చూపులలో తీక్షత పెరగసాగింది. అంతకంతకూ వదనం గంభీరతను దాలుస్తున్నది

ఉత్కంఠతతో చూస్తున్న అతనికి ఊపిరి అందటం కష్టంగా ఉంది. ఫ్యాను పైన తిరుగుతున్నా స్వేదం బిందువులు బిందువులుగా అలాపొంగుకొని వస్తూనే ఉన్నది.

వదనాన్ని పైకెత్తి సూటిగా అతని కన్నులలోనికి చూస్తూ, "ఏమిటీ పని? ఊఁ. ఏమిటిపని? చెప్పు ఊఁ. ఎవరిని అడిగి చేశావ్? మీతో చెప్ప కుండా ఒక చిన్న మంచిపని చేశాను. అని నీవు చెప్పినప్పుడే అనుకు న్నాను ఇలాంటిదేదో చేసు ఉంటావని. ఏమిటిపని?"

"మంచి పనని నీవనుకుంటే సరిపోయిందా? నీకు మంచిపని అని పించింది, నాకు అనిపించక పోవచ్చుగదా? ఏమంటావ్? ఎందుకిలా చేసావ్? ఇలా చేయాలని నీకెందుకు అనిపించింది. చెప్పవేం? ఆఁ: చేసిన వాడివి చెప్పవేమయ్యా! ఎందుకు చేశావిది?"

చెమటలు పడుతున్న అతనికి ప్రయత్నించినా గొంతు పెగులు తున్నట్లుగా లేదు మరింత ప్రయత్నం మీద గొంతును పెగుల్చుకుంటూ, "క్షమించండి మాష్టారూ! మీ అనుమతిని తీసుకోకుండా ఇలా చేయటం తప్పే. అందులో వేరే ఉద్దేశం ఏదీ లేదండీ! మీమీద ఉన్న ఆరాధనా భావంతో ఈ పెట్టబోయే వ్యాపారసంస్థకు కూడా మీపేరే పెట్టుకోవాలని ఉద్దేశపడ్డాను.

కాని నేను చేసింది తప్పే, ముందుగా మీతో చెప్పి, మీ అనుమతిని తీసుకొని చేయవలసింది. తప్పు జరిగి పోయింది. దీనికి కారణం ఒక్కటే నేను చేసిన ఈ పని మిమ్మల్ని ఇంతగా నొప్పిస్తుందని నేను ఊహించ లేదు."

కొద్ది నిముషాల పాటు నిశ్శబ్దం అక్కడ ఆవరించింది. బొమ్మలోని ఒక దృశ్యంలా ఆ గది అలా నిలబడి పోయింది.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ, మాష్టరుగారిలా అన్నారు. "మరిప్పు డేమిటి చేస్తావ్? ఊం ఏం చేస్తావయ్యా?"

"మీరేం చేయమంటే అది చేస్తానండీ! జరిగిన దానికి బాధపడు తున్నానండీ!" అన్నాడతను దీనవదనుడై.

పుస్తకాలు రెండింటినీ అతని చేతికందిస్తూ, "ఒకపనిచేయి. ఈ పుస్తకాలని ఇంటికి తీసుకువెళ్ళి ఒకచోట పెట్టు. పెట్టి వాటిపైన ఒక అగ్గి పుల్లగీసి పడేయ్. ఏం. అర్థమయిందా?"

అతను తల వంచుకుని ఉన్నాడు. అతని చూపులు మాత్రం మాష్టరుగారి పాదాల చుట్టూ తిరుగుతున్నాయి.

మళ్ళీ కొంతసేపు నిశ్శబ్దం.

భరించడానికి కష్టంగా ఉన్న నిశ్శబ్దమది.

ఆ నిశ్శబ్దాన్ని అంతంచేస్తూ, మాష్టరుగారు ఇలా అన్నారు.

"నేను నీ భక్తిని అర్థం చేసుకోగలను. కాని నీ చర్యను సమర్థించ లేను."

అతడు ఆవేదనతో కూడిన ఆశ్చర్యంతో తలను పైకెత్తి మాష్టరు గార్నిని చూస్తున్నాడు..

మాష్టరుగారు ఇంకా ఇలా అన్నారు: నీ ఈ చర్యను సమర్థించడం సాధ్యంకాదు ఇన్నినాళ్ళ మన సాహచర్యంలో ఎవరైనా తమ వ్యాపారాలకు గానీ, సంస్థలకు గానీ, మన పేరు పెట్టినట్లు చూసావా?

"లేదు" అన్నాడతను.

మరి నువ్వెందుకు అలా చేశావ్ ? వాళ్ళే చేసి ఉంటే బాగుండేది. వాళ్ళు చేయలేదు కాబట్టి మనమైనా చేద్దామని నీ కనిపించింది కదూ! పిచ్చివాడా! కాస్తంత సందిచ్చి ఉంటే ఇప్పుడు నీవు చేసిన పని కొన్ని పదుల మంది చేసేవారు

చూడూ! ఇలా వ్యాపార సంస్థలకూ వాటికీ తమ పేర్లను వాడు కోవటానికి ఇష్టపడటమనేది ఉన్నదే, దీనికి పరమ గురువులు ఏ మాత్రం అంగీకరించరు. వాళ్ళకు ఇష్టంలేని పని ఇది. ఈ విధమైన ప్రచారానికి వాళ్ళు సుముఖత చూపరు.

పోనీ నీవు పెట్టావే అనుకో. పేరయితే పెట్టగలుగుతావు గాని, ఆ పేరుకు తగ్గట్టుగా నీవా వ్యాపారాన్ని నడప గలుగుతావా? వ్యాపార మన్న తరువాత ఎన్ని లావాదేవీలుంటాయి? మరి, ఇవన్నీ ఈ పేరు మీదుగా నిర్వహించడం భావ్యమంటావా? ఒక్క క్షణం ఆలోచించు. మాష్టరుగారి పేరు పెట్టుకోవాలని ఉబలాట పడ్డావు. అంతవరకు బాగానే ఉంది. మరి ఆ పేరుకు మనం న్యాయం చేయగలమా? లేదా? అని ఆలోచించావా?

"అయితే లోకంలో చాల మంది తమకు నచ్చిన పెద్దల పేర్లనూ, దేవుళ్ళ పేర్లనూ తమతమ వ్యాపారాలకు ప్రాజెక్టులకూ పెట్టుకుంటున్నారు కదా!" అని నీవనవచ్చు. అదివేరు విషయం. ఎందుకని అలా అంటున్నా నంటే వాళ్లు ఆ పేర్లను తమకు కలిసి రావలనే ఉద్దేశంతో పెట్టుకుంటు న్నారు తప్ప, ఆ పేర్లకు తగ్గట్టుగా నడుచుకోవాలని వారనుకోవడం లేదు.

దేవుడి ప్రకారం తాను పనులు చేయడమన్నది మరచిపోయి, తాను చేయ దలచిన పనులకు దేవుణ్ణి తీవ్రస్థాయిలో వాడుకునే ప్రయత్నం చేస్తున్నాడు ప్రస్తుత భారతీయుడు. అది మంచి పద్ధతంటావా? నువ్వూదాన్ని అనుసరిస్తా నంటావా? మనం చేసేపనులు లోకానికి మంచిదారిని చూపించేవిగా ఉండాలి. అంతేగాని, లోకాన్ని మనం గుడ్డిగా అనుకరిస్తూ వెళ్ళిపోతే ఎలా?

మళ్ళీ కొంతసేపు నిశ్శబ్దం.

ఈసారి నిశ్శబ్దం ఆలోచనాత్మకంగా ఉంది.

మాష్టరుగారి పెదవులు చిన్న చిరునవ్వు నవ్వుతూ విచ్చుకున్నాయి. విచ్చుకుంటున్న పెదవులతో కొంటెగా, అతని గుండెలకు గుచ్చుకునేటట్లు చూస్తూ, ఇలా అన్నారు. ఏమోయ్! నీ ప్రయత్నమదీ చూస్తుంటే నన్ను కూడా ఒక దేవుణ్ణి చేసేదాకా వదిలేలాగా లేవే? ఊ అంతేనా! చూడూ! ఆ వెర్రిన పడకు నన్ను నన్నుగా ఉండనీ. నా గురించి లోకానికి చెప్పేముందు, నేనంటే ఏమిటో తెలుసుకో. అది చాలు నాకు. నిజానికి ఏ పెద్దవాళ్ళయినా సన్నిహితుల నుండి అభిలషించేది అదే. అది మాని, ఆ అర్థం చేసుకోవటం మాని, లోకంవైపుకు తిరిగి బాకా కొట్టుకోవటం కలిప్రేరితమైన ఆధునిక లక్షణాలలో ఒకటి

నేను నీకు నచ్చాను. బాగుంది మంచిదే, అయితే అప్పుడు నీవేం చేయాలి. నా జీవన విధానం నీకు నచ్చింది కనుక నేను ఏ సూత్రాలకు కట్టుబడి జీవిస్తున్నానో సాహచర్యంలో ఎప్పటి కప్పుడు గమనించు కుంటూ అలా నీవు కూడా నీ జీవితాన్ని నడుపుకునే ప్రయత్నం చేయాలి. అంతేగాని, మిగిలిన ఈ హడావిడంతా ఎందుకు? హడావిడి వల్ల ఏమిటి చేద్దామని నీ ఉద్దేశం? వేలాదిగా జనాన్ని ఆకర్షించి, నా పాదాల మీద పడేద్దామనా? ఒకవేళ అలా పడేశావనే అనుకుందాం. వక్రమార్గాల ద్వారా ఆకర్షింపబడిన జనం ఎంతకాలం నిలుస్తారు? చెప్పు.

చేతనైతే నీవు కూడా నాలాగా జీవించు. నీ జీవితాన్ని ఇలా సద్వినియోగం చేసే ప్రయత్నం చేయి. అప్పుడు నా జీవితం నీకూ, నీలాంటి మరి కొందరికీ ప్రేరణ నిచ్చినట్లే నీ జీవితం కూడా మరింత మందికి ప్రేరణ నివ్వగలుగుతుంది. నీ గొంతుతో కాదు, ఈ పేర్లతో కాదు, నిజంగా నేనంటే నీకు ఆరాధనా భావం ఉంటే, నేనంటే ఏమిటో నీ జీవిత విధానం ద్వారా ఈ లోకానికి తెలియజెప్పు. ఈ బోర్డుపైన కాదు నీలోపల ఆ గుండె లోపల వ్రాసుకో. ఆంజనేయుడు చేసిందదే. చేతనైతే అతణ్ణి అనుసరించు అతడు తన జీవన విధానం ద్వారా ఇవాల్టికి కూడా రాముని చెంతకు జనాల బారులను నడిపిస్తూనే ఉన్నాడు.

కేకలేశానని బాధ పడ్డావా? అవి బాధ పడి వేసిన కేకలు. సత్యం నీకు బోధ పడాలని వేసిన కేకలు. అభిమాన మనే వైరినుండి, "ఆరాధన" అనే అమృతత్త్వానికి నిన్ను మళ్ళించటానికి వేసిన కేకలు. కేకలువేశానని బాధపడుతున్నావా?

అతని కన్నుల వెంట బాష్పాలు రాలుతున్నాయి. మామూలు బాష్పాలు కావవి. అనుభూతి బాష్పాలు. ఆ బాష్పాలలో నుండి అతడు మాష్టరుగారివైపు చూస్తున్నాడు. ఆ లీలా మానుష విగ్రహాన్ని, ఆ బాధ్యతాయుత స్వరూపాన్ని, అమానవాతీత వ్యక్తిత్వాన్ని దర్శనం చేస్తూ పులకించి పోతున్నాడు. ఆ బాష్పాలు ఆ పుస్తకాల కట్టలపైన పడుతున్నాయి. అతడా కట్టల వైపు చూసాడు. ఇవి కదా! నా కెంతటి పాఠాన్ని చెప్పించాయి. అన్నట్లు ఆదరంతో చూసాడు వాటివైపు అతను, వాటిని చూస్తూ. మళ్ళీ మాష్టారు గారిని చూస్తూ మాష్టరు గారిని చూస్తూ, మళ్ళీ వాటిని చూస్తూ, ఇలా మార్చి మార్చి చూస్తూ, అలా అలా అంతర్ముఖుడై పోతున్నాడతను.

ప్రేమను కురిసే కన్నులతో చూస్తున్నారు. మాష్టరుగారు, అతని వైపు తృప్తిగా.

# నిండు కుండ

"మాష్టరుగారూ: మీ విషయంలో కలుగ జేసుకుంటే ఎలా ఉంటుంది?"

ఏ విషయంలో?

క్రొత్తగా వచ్చిన ఆయోగి విషయంలో.

ఏం! ఇప్పుడంత అవసర మేమొచ్చింది:

"రాలేదంటారా? ఆయన ఏవేవో మహిమలు చేస్తున్నాడు. హోదాలలో ఉన్నవాళ్ళని ఆ మహిమలతో తన వైపుకు త్రిప్పుకుంటున్నాడు. ఆ హోదాలలో ఉన్నవాళ్ళను చూపెట్టి, వాళ్ళ దగ్గర పనిచేసే వాళ్ళందరినీ తన వైపుకి మళ్ళించు కుంటున్నాడు ఇదిగో "విభూతి" అంటాడు. ఇదిగో "శివలింగం" అంటాడు. తనకు మూడవ కన్ను ఉందీ అంటాడు. నిన్న ఒక పిడ్డీ కొట్టు కాలి పోవటం దాని ప్రభావమేనంటాడు. ఇక్కడ మాయమై పోతాడట, మరెక్కడో ప్రత్యక్షమౌతాడట. ఒక విగ్రహాన్ని చేతిలో పెట్టుకుంటాడట అది మరొకరి విగ్రహంగా మారి పోతుందట, భక్తులూ, భజనలూ, హారతులూ, తీర్థ ప్రసాదాలూ, మహిమలూ. మధ్యలో సందేశాలు. మరి: మీలాంటి వాళ్ళు ఇలాంటి ఘోరాలను ఆపక పోతే ఎలా?

మీకు తెలిసే ఉంటుంది. పూర్వం మీ దగ్గరి కొచ్చే వాళ్ళల్లో కొందరు అక్కడ కనబడుతున్నా రిప్పుడు. మీరింకా ఉపేక్ష చేయటం అంత మంచిది కాదేమో ననిపిస్తుంది. సహనానికి కూడా ఒక హద్దంటూ ఉండాలి కదా! నేను మీకు చెప్పగలిగి నంతటి వాణ్ణి కాను. కాని ఎందుకనో మనస్సు ఉండబట్టలేక పోతోంది. అందుకని నా కనిపిస్తున్న అంశాన్ని మీకు మనవి చేసుకున్నాను. నేను చెప్పడం పూర్తయింది.

ఇక మీరేం చెబుతారో వినాలని ఉంది- అన్నట్లుగా చూస్తున్నాడతను. నాలుగు పడులు దాటిన వాడు. మాష్టరుగారి అడుగు జాడల్లో నడుద్దామనే తపన గలవాడు. "తపస్సుతో, ప్రవర్తనతో ఒక ఆధ్యాత్మిక వేత్త తనకు తాను రూపుదిద్దుకోవాలి గాని, ఇలా గారడీ వేషాలతో, అల్పమైన చిట్కాలతో జనాన్ని చిక్కించుకుందామని. తానొక పెద్దవాడిగా చలామణి అవుదామని ప్రయత్నించటం దోషం కాదా? అది మోసం కాదా? అలా చేయ వచ్చునా? తెలిసిన వారు దానిని సహించ వచ్చునా?" అన్నది అతని ఘోష. మానసికమైన ఆ ఘోషను మాష్టరు గారి ముందు తగిన భాషలో పెట్టే ప్రయత్నం చేసాడతను ఎప్పటి నుండో ప్రయత్నం చేస్తున్నట్లున్నాడు అట్లా చెప్పటానికి ఇప్పటికి అవకాశం వచ్చింది.

కొద్ది క్షణాల మౌనం తరువాత అతని వైపు చూస్తూ మాష్టరు గారిలా అన్నారు. నీవడిగిన దానికి జవాబు చెబుతాను విను. ఎవడికి తోచినట్లుగా వాడు బ్రతుక వచ్చు. అందుకు మరొకరు తప్పు పట్ట వలసిన అవసరం లేదు. అయితే ఆ ప్రవర్తన వల్ల మరొకరికి అపకారం జరుగు తుంటే మాత్రం, దానిని అడ్డుకోవాలి. అప్పటివరకూ అతనికి మనం అవకాశ మివ్వాలి.

అయితే అతడు కొందర్ని తనవైపుకు త్రిప్పుకుంటున్నాడు కదా! వాళ్లను భ్రమింప చేసి ఆకట్టుకుంటున్నాడు కదా;" అని నీవన వచ్చు. అయితే ఒక ప్రశ్న. కొందరినే ఎందుకు ఆకట్టుకో గలుగు తున్నాడు? మిగిలిన వారిని ఎందుకు ఆకట్టుకోలేక పోతున్నాడు? ఈ కొందరిలో ఏదో బలహీనత ఉందన్నమాట. మన మిలా భ్రమింప జేయబడితే బాగుండును అనే కోరిక వీళ్ళలో ఉందన్నమాట. దేవుడు అంటే ప్రేమ మయుడు అని కాక, అద్భుతాలూ, ఆశ్చర్యాలూ చేసే గారడీవాడని వీళ్ళు నమ్ముతున్నారన్నమాట. అటువంటప్పుడు వీళ్ల నమ్మకాన్ని

అతడు సొమ్ము చేసుకోవటంలో అంతగా తప్పు పట్టి వలసిందేముంది? అతని దగ్గర ఏవో కొన్ని విద్యలున్నాయి. లేదా కొన్ని పట్లు ఉన్నాయి. వాటిని ఉపయోగించి, తన చుట్టూ జనాన్ని చేర్చుకుని, అతడేదో కులాసాగా కాలం గడుపుతున్నాడు. అది అతని వృత్తి అనుకుందాం. ఆవృత్తితో అతడు పొట్ట పోసుకుంటున్నా డనుకుందాం. ఇప్పుడతని పొట్ట మీద మనం కొట్టవలసిన అవసరం ఏమి వచ్చింది?

అయితే ఇక్కడ ఒకటున్నది. అతడు పొట్ట పోసుకోవటం వరకూ, సుఖభోగాలను అనుభవించే టంతవరకూ, పరిమితమైతే అతణ్ణి మన మేమీ-అనుకో నక్కరలేదు. భూమి మీదపుట్టిన ప్రతివానికీ, ఆ అవసర ముంది కనుక. అయితే అంతకు మించి, అతడు జన జీవితాలతో ఆడుకోవటం వాటిని పాడుచేయటం, జరిగితే మాత్రం, అతనికి బుద్ధి చెప్పవలసిన అవసరం ఏర్పడుతుంది. అప్పటి వరకూ అతణ్ణి సహించటం ధర్మ మవుతుంది.

ఇక్కడో సూత్రాన్ని గమనించాలి. ఎప్పుడైతే కొంత మందిని తన మహిమలతో ఆకర్షించ గలిగాడో, అప్పుడే కొంత మందిని తనను వ్యతిరేకించే వాళ్ళను కూడా తాను సృష్టించుకోగలిగాడు. ఇప్పుడేమయింది? అతడు ఇరువర్గాల మధ్యలో ఉన్నాడు. ఆ ఇరు వర్గాలకీ ఘర్షణ కూడా ప్రారంభమైంది. ఆఘర్షణలో ఎవరు గెలుస్తారన్నది ఇతనిపైనే ఆధారపడి ఉంది ఇతను సత్ప్రవర్తన, సేవా భావం కలిగిన వాడయితే ఇతడూ, ఇతన్ని నమ్మిన వాళ్ళూ గెలుస్తారు. సత్ప్రవర్తన లేనివాడయితే సమయం వచ్చినప్పుడు ఆ వ్యతిరేకించే వాళ్ళు ఇతని దుమ్ముదులిపేస్తారు. చివరకు తేలేదేమిటంటే, ఎవరినైనా రక్షించ గలిగేది వారి ప్రవర్తనే నని, వారు చేస్తున్న ధర్మాచరణమేనని. కనుక కొద్ది కాలంలోనే ఈ అంశం పరిష్కరింప బడుతుంది. కొంచెం ఓపిక పట్టు.

కాలం ఈ కథను మన దాకా రానివ్వదు. ఎందుకనంటే ఖాళీ దొరకని కర్తవ్యనిర్వహణలో ఇప్పటికే అది మనలని పెట్టింది కనుక. ఇక మన వాళ్లల్లో కొందరక్కడ కనబడ్తారంటావ్. మన దగ్గరకు వచ్చిన వాళ్లందరూ, వస్తున్న వాళ్లందరూ మన వాళ్ళే ననుకోవటం తప్పు కదూ! మన వాళ్ళుగా వారుండి పోవాలి, అనుకోవటం కూడా తప్పే. మనతో ఉండవలసిన వాళ్ళెవరూ అన్నది నిర్ణయించ వలసింది మనం కాదు దైవం. ఆ నిర్ణయాధికారాన్ని ఆయనకే అప్పగిద్దాం. దానిని మన చేతులలోనికి తీసుకునే ప్రయత్నం మనం చేయవద్దు. అలా చేస్తే అది అహంకార మవుతుంది. లేదా తాపత్రయ పడటమవుతుంది. ఈ అహంకార, తాపత్రయాల్లోపడి మన కర్తవ్య నిర్వహణను మనం మరచి పోవటం జరుగుతుంది. ఏం ఏమంటావ్? నీకు తృప్తి కలిగించాయా నేను చెప్పిన వివరణలు?

అతను తృప్తిగా చూస్తున్నాడు. చూసి, చూసి ఒక మాట మంత్రంగా అన్నాడతను. "నిండు కుండ తొణకదు." అని.



# ప్రకృతి చిత్రాలు

"ఈ పుస్తకాన్ని మీరు చూసారా? చూడకుండా ఎందుకుంటారు? కాని, దీన్ని గూర్చి మీరేం చెబుతారో వినాలనిపించి, దీన్ని పట్టుకొచ్చాను" అంటూ ఒక పెద్దాయన పుస్తకాన్ని మాష్టరుగారి చేతిలో పెట్టాడు.

చూశాను. మీకేమిటి ఇలాంటి సంకల్పం కలిగింది? ఎవరి చూపు వారిది ఎవరి సంస్కారం వారిది. విశ్వనాథ వారికి ఏది కల్పవృక్షంగా కనిపించిందో, అది ఈ రచయిత్రికి విషవృక్షంగా అనిపించింది. విశ్వనాథవారు లోపలకు వెళదామని ప్రయత్నించారు. ఈమె లోపాలను వెతుకుదామని కంకణం కట్టుకున్నది కానీ, రామాయణం లాంటి పవిత్ర గ్రంథాలు వాటిని గూర్చి ఎలా స్పందించినా, ఆ స్పందించిన వారికి మంచినే చేస్తాయి. విశ్వనాథవారికి "జ్ఞానపీఠం" అవార్డు లభించింది. ఈ రచయిత్రికి కావలసినంత ప్రచారం, ధనం లభించాయి. బహుశః ఈమె వ్రాసిన ఏ ఇతర గ్రంథమూ ఇంత ప్రచారానికి నోచుకొని ఉండదు. ఇంత ధనాన్ని సమీకరించి పెట్టి ఉండదు. కనుక రామాయణానికున్న శక్తి ఎంతటిదో ఈమె కూడా గమనించే ఉంటుంది.

ఇక ఈమెకు చెప్పబడవలసిన జవాబు అంటారా? ఈమెకు తగిన ఆమె మరొకామె ఉంది. ఆమె చెప్పింది ఆవిడ దగ్గర ఒక విశేషముంది. ఈ రచయిత్రి ఎలాంటి భాషలో వ్రాసిందో, అలాంటి భాషలో ఈమెను తిట్టగలిగిన సామర్థ్యం, ఈమెకు జవాబులు చెప్పగలిగిన ఒడుపూ ఆమెకు ఉన్నాయి. ప్రకృతిలో ఎవరికి తగిన జోడీ వారికుంటుంది. అది అలా ఏర్పాటు చేయబడుతుంది. ఆ సమతూకం అలా నిలబడుతూనే ఉంటుంది.

"మరి, ఈ జవాబు చెప్పబడేలోపల ఇలాంటి పుస్తకాలు లోకానికి చాల అపకారం చేస్తాయి కదా!" అన్నాడా పెద్దాయన.

లేదు. వీటివల్ల జరిగే అపకారం కన్నా ఉపకారమే ఎక్కువ. ఇలాంటి పుస్తకాలు సమాజానికి ఒక విధమైన షాక్ ట్రీట్‌మెంట్ నిస్తాయి. ఆ షాక్‌నుంచి కోలుకుంటూ, క్రమంగా సమాజం ఆలోచనలో పడుతుంది. ఈ గ్రంథంలో చెప్పబడింది ఎంతవరకూ నిజం అని ఆలోచించు కుంటుంది. నిజానిజాలను తెలుసుకునే ప్రయత్నం చేస్తుంది. ఈ ప్రయత్నాలు అన్ని వైపులనుండి జరుగుతూ ఉండగా అందులో తగిన వారి నుంచి, ఈ పుస్తకానికి తగిన జవాబు లభిస్తుంది. దానితో ఈ పుస్తకం ప్రక్కన పడిపోతుంది. సమాజాన్ని ఒక కుదుపు కుదిపింది. ఆలోచింప జేసింది. జవాబును పొందింది. ప్రక్కన పడిపోయింది. ఇలా జరగటం మంచిదే కదా! ఈ పుస్తకం వచ్చిన తరువాత అప్పటివరకూ సినిమాల ద్వారా మాత్రమే రామాయణాన్ని చూస్తున్న వాళ్ళెందరో, తమ ఇళ్ళల్లో మూలన పడి ఉన్న రామాయణ గ్రంథాలను బూజు దులిపి లోతుగా అధ్యయనం చేయటం మొదలుపెట్టారు. మనకు తెలిసిందే కదా రామాయణ కథ." అని బద్ధకిస్తున్న వారెందరో పెద్దల దగ్గరకు తాముగా చేరి, రామాయణాన్ని గురించి తరచి, తరచి అడుగటం మొదలుపెట్టారు. అలా మన జాతిని రామాయణానికి మళ్ళీ మరింత దగ్గర చేయటానికి ఈ గ్రంథం చాలా దోహదం చేసింది. పైనుండి చూస్తే ద్రోహం చేసింది. అనిపిస్తుంది గాని, కొంచెం పరిశీలనగా చూస్తే చాలా దోహదం చేసిందని తెలుస్తుంది.

"ఇంతకీ ఈవిడ చూపులో ఆ తేడా ఎలా వచ్చిందంటారు? రామాయణం అందరిలా కాకుండా అలా ఎలా చూడగలిగిందావిడ?" అన్నాడా పెద్దాయన.

ఈవిడ చూపులోనే కాదు. అనాదిగా అలా రామాయణాన్ని తేడాగా చూస్తూ వస్తున్న వాళ్ళూ ఉంటూనే ఉన్నారు. అలా ఉంటూనే ఉంటారు. అది సహజం. వీళ్ళందరూ అనేదేమిటంటే వాళ్ళ ప్రకారం రామాయణం ఉండాలంటారు. వాళ్ళనుకున్న ధర్మాన్ని రామాయణం చెప్పాలంటారు వాళ్ళనుకున్న జీవనసూత్రాలకు రామాయణంలోని పాత్రలు కట్టుబడలేదంటారు. మేమనుకున్న జీవన సూత్రాలకూ, విలువలకు ఈ పాత్రలూ, ఈ కథా కట్టుబడటం లేదు కనుక ఇదంతా దోషం. ఇది ఒక విషం అంటారు.

ఇక్కడొక సూక్ష్మమున్నది. ఈ సృష్టిలో ఒకడికి ధర్మమనిపించింది, ఇంకొకడికి ధర్మమనిపించకపోవచ్చు. ఒకడికి జీవన సూత్రాలుగా కనిపించినవి, మరొకరికి అవి సూత్రాలే కావనిపించవచ్చు. మానవ పరిణామంలో అనేక స్థాయిల్లో ఉన్నవాళ్ళు ఈ లోకంలో ఉంటూ ఉంటారు. ఎవరి స్థాయిని బట్టి వారి జీవన సూత్రాలు, వారి నైతిక విలువలు రూపు కట్టుకుంటూ ఉంటాయి వారు వాటికి తగ్గట్లుగా ప్రవర్తిస్తూ ఉంటారు.

చిత్రమేమిటంటే ఎవరికి వారికి మనలాగా మిగిలిన లోకముంటే బాగుంటుంది కదా! అనిపిస్తుంది. ఒక్క ఋషి స్థితిలో ఉన్నటువంటివాడు మాత్రమే ఈ సృష్టిని చూడవలసిన విధంగా చూడగలుగుతారు. మిగిలిన వారంతా తమ ప్రకారమే చూస్తారు. తాము నమ్మిన విలువల ప్రకారమే చూస్తారు. అలాగే ఈమె కూడా తన దగ్గరున్న రాళ్ళతో "రామాయణ గాధను, పాత్రలను తూచే ప్రయత్నం చేసింది. "తూచి" బాగుండ లేదన్నది. అందులో అన్నీ లోపాలే అన్నది. ఇది ఒక విషవృక్షమన్నది.

కాని, ఈ కథ యొక్క నేపథ్యం ఏమిటి? ఈ పాత్రల యొక్క నేపథ్యం ఏమిటి? ఈ పాత్రలు పాటించిన జీవన సూత్రాల వైఖరు లేమిటి? వారు వారి జీవితాలను ఎలా చూశారు?" అని ఆమె ఆలోచించలేకపోయింది! ఆమెనిండా నిండిన అసహనం ఆమెలో అలాంటి ఆలోచన రానీయకుండా చూసింది. ఈ గ్రంథంలో కనబడేది ఈమె పరిశీలన కాదు. ఈమె అసహనం. అయితే ఈవిడ ఏ చూపుతో రామాయణాన్ని చూడలేకపోయిందో, ఆ చూపు సమాజానికి కలిగేటట్లుగా ఈ గ్రంథం చేయగలిగింది. "నాలోని అసహనం నన్ను చూడనీయటం లేదు మీరేమయినా చూడగలరేమో ప్రయత్నించండి." అని ఆమె చెప్పినట్లైంది. చివరకు ఆమె చెప్పినట్లే అయింది. సమాజం రామాయణాన్ని సహనంతో తరచి చూసే ప్రయత్నంలో పడింది. ఇలాంటి ప్రయత్నానికి శ్రీకారం చుట్టించిన ఈమె అసహనానికి మనం కృతజ్ఞతలు తెలియ జేయాలి.

ప్రకృతి చిత్రమైనది. అది మనుష్యులలోని బలహీనతలనుకూడా సద్వినియోగం చేస్తుంది. మనుష్యుల యొక్క అశక్తతను కూడా సద్విని యోగం చేస్తుంది మనుష్యుల యొక్క అశక్తతను కూడా తన శక్తిగా వాడుకుంటుంది. చివరకు కథ లోకశ్రేయస్సువైపుకే నడుస్తుంది. ఎవరు ఎటు చూస్తున్నామనుకున్నా ప్రకృతి ఆ లోక శ్రేయస్సు వైపుకే వారి ప్రయత్నాలను మలుచుకుంటూ ఉంటుంది. అలాంటి కౌశలం దానికి ఉంది."

"ఇలా సమన్వయించి చెప్పగల కౌశలం మీకుంది. ఇది మీ ప్రత్యేకత ఒక సన్నివేశాన్ని ఎలా చూడాలి, అన్న ఆ చూపు మీలో

ఉంది. ఇలా చూసి చెప్పగలిగిన వాళ్ళున్నప్పుడు మాత్రమే. లోకం పది కాలాలపాటు కలిసి బ్రతకగలుగుతుంది. అందరూ తనవారేనని ప్రతి మనిషీ అనుకోగలుగుతాడు. జరుగుతున్న ప్రతి ప్రయత్నము లోక శ్రేయస్సు వైపుకే మళ్ళింపబడుతుంది."— అన్న మీ దర్శనం అపురూపంగా ఉంది. ఇవి పొగడ్తలు కావు. ఇప్పుడు మీ సన్నిధిలో మనస్సు పొందుతున్న పులకింతలు, మళ్ళీ ఇలా మీతో మాట్లాడగలిగే సందర్భం ఎప్పటికి కుదురుతుందో? ఏమో! ఈ సన్నివేశం ఈ మీ సందేశం మాత్రం నా జీవితంలో ఇలా నిలిచిపోతాయి. వస్తాను." అంటూ ఆ పెద్దాయన కదలలేక కదిలాడు.

మాష్టరుగారు ఆ కదులుతున్న అతన్ని అలా తృప్తిగా చూస్తూ అతనికి కావలసిన చూపేదో దానిని అనుగ్రహిస్తున్నట్లుగా కనిపించారు.



# కాలచక్రం

"మాష్టారుగారూ! ఇప్పుడు మిమ్మల్నొక అంశం అడుగుతున్నాను."

"అడుగు." అది సరేగాని, అదేమిటోయ్ అలా దడిపిస్తున్నట్లుగా మాట్లాడుతున్నావ్."

ఇద్దరం నవ్వుకున్నాం.

"ఏం లేదు. నాలో ఒక అంశం అలా మెదులుతోంది. మెదులుతూ ఉండగానే మీతో అనేశాను. అందుకని, నా మాటలు మీకలా అనిపించాయి. అంతకంటే ఇంకేం లేదు.

ఇంతకూ ఆ మెదులుతున్న అంశమేమిటంటే ఇంతమంది పెద్దలు కనబడుతున్నారు. వాళ్ళు పెట్టిన సంస్థలు కూడా పెద్ద ఎత్తున రూపు కట్టుకుంటున్నాయి అయితే వారి తరువాత అవి కొనసాగడానికిగాను వారు తీసుకుంటున్న చర్యలే తక్కువగా కనబడుతున్నాయి. అప్పుడే కొన్ని కొన్ని సంస్థలలో దీపాలు పెట్టే వాళ్ళని కూడా వెతుక్కోవాల్సి వస్తోంది. ఎందుకని ఇలా జరుగుతోందంటారు! సంస్థలు పెడుతున్నారు పెద్ద పెద్ద బిల్డింగులు కడుతున్నారు. అనేకమైన కార్యక్రమాలు చేపడుతున్నారు. అలాంటి వాళ్లు తర్వాతి తరాన్ని రూపొందించటంలో ఎందుకని వెనుకబడుతున్నారు?

తమ చేతికి నేనందిస్తున్న వక్కపలుకును స్వీకరిస్తూనే అలా ఆలోచనా నిమగ్నమైన వదనంతో కొద్ది క్షణాలు ఏదో లోకాలలోనికి చూస్తున్నట్లుగా చూస్తూ, అలా ఉండిపోయారు మాష్టరుగారు.

కారు దొండపర్తి జంక్షన్ దాటుతోంది. చినవాల్తేరులోని ఒక కార్యక్రమానికి మేము అటెండ్ కావలసి ఉంది. ఈలోపు సమయం ఇలా సద్వినియోగం అవుతోంది. డ్రైవరును తప్పిస్తే కారులో ఉన్నది మేమిద్దరమే

చిరునవ్వులు చిందిస్తూ ఇలా అన్నారు మాష్టరుగారు. గడుసైన ప్రశ్నే వేశావు. కాని వేయవలసిన ప్రశ్నే ఇది. చూడు. పూర్వం మన పెద్దవాళ్ళందరూ తమ తర్వాతి తరం వారిని నిర్మాణం చేయటంమీదనే దృష్టిని పెట్టేవాళ్లు. ఇప్పుడు ఆ దృష్టి అంతా భవనాల నిర్మాణంమీదకూ, వనరుల సమీకరణం మేరకు మళ్ళుతూ ఉన్నది. అయితే ఇవి అవసరం లేదని అర్థం కాదు. గమ్యాన్ని గుర్తు పెట్టుకొని, దానివైపుకు ప్రయాణం చేస్తున్నప్పుడు వీటిని నిర్మించటం, స్వీకరించడం మంచిదనే. కాని, ఇవే గమ్యం కాకూడదు. ఈ నిర్మాణాలే గమ్యమనుకుంటే, నీవన్నట్టుగా ఆ తర్వాతి కాలంలో దీపాలు పెట్టేవాళ్ళని వెతుక్కోవలసి వస్తుంది. ఏది ముందు, ఏది వెనుక, ఏది ప్రధానం, ఏది అప్రధానం అని గుర్తించ గలిగిన, గుర్తించి వర్తించగలిగిన వివేకం చాలా అవసరం. అది ఈ మధ్యకాలంలో ఎక్కడోకాని కనబడటం లేదు.

ఇక రెండవ అంశం. ఒక పెద్దవాడి దగ్గరకు ఆకర్షితులై కొందరు చేరతారు. అతన్ని అభిమానిస్తారు ఆరాధిస్తారు. అప్పుడతనేం చేయాలి? వారిని చేరదీసి, సంస్కరించి, తీర్చిదిద్దే ప్రయత్నం చేయాలి వారిని ప్రయోజకులుగా రూపొందించాలి. కాని, ఇవాళ ఎక్కువమంది ఆ పని చేయటం లేదు. ఆకర్షితులై చేరినవారిని కేవలం అభిమానులుగా ఉంచు కుంటున్నారు. "ఇంతమంది తమతో ఉన్నారు." అన్న వైభవాన్ని ప్రదర్శించుకొంటున్నారు. ఆ అభిమానులు వీళ్ళను పొగుడుతూ, చప్పట్లు కొడుతూ కాలక్షేపం చేస్తున్నారు. దానితో వారికి కొంత కండూతి

తీసుతూ ఉంటుంది. ఇంతలో ఈ పెద్దవాళ్ళ శరీరాన్ని చాలిస్తారు. ఇక ఆ అభిమానులకు, ఆ పెద్దలతో పాటు తిరుగుతూ ఉండగా అయిన అల వాట్లు ఏవైనా వుంటే అవి మాత్రం దక్కుతాయి. పక్కపొడి వేసుకోవటం, నశ్యం పీల్చడం- ఇలాంటివన్నీ ఇలా కాకుండా, వారిని కేవలం వెంట తిరిగే అభిమానులుగా కాకుండా తమ అడుగుజాడల్లో నడవగలిగిన అను యాయులుగా రూపొందిస్తే ఎంత బాగుంటుంది. కాని అందుకు వారిలో ఎక్కువమందికి ప్రాణం ఒప్పటంలేదు. తమ ప్రభ వెలగడానికి వారిని వినియోగించుకుంటున్నారే తప్ప,వారి జీవితాలను పెంగించి, ఈ లోకానికి దీపావళి చేయాలని వారికి అనిపించటం లేదు.

"ఎందుకని అంటావు? ఎందుకని అలా చేస్తున్నారు వాళ్ళు?" అడిగాను నేను బాధగా.

మాష్టరుగారిలా అన్నారు. వెంట త్రిప్పుకోవటానికి అహంకార ముంటే చాలు. వెలిగించటానికి ఆత్మార్పణం కావాలి. తనకు తాను గుర్తున్నవాడు, తనతో ఉన్నవాడిని పెంచలేడు. వాడు పెరగడానికి ఇష్టపడడు కూడా! అలా పెరగకుండా ఉండటానికి కావలసిన ఏర్పాట్లు కూడా చేయగలడు. ఈ లక్షణాలన్నీ ఎక్కువగా రాజకీయరంగంలో మాస్తుంటాం. చిత్రమేమిటంటే ఇప్పుడీ లక్షణాలు అన్ని రంగాలకు వ్యాపించాయి.

మనను అభిమానించి, దగ్గరై, ఆరాధిస్తున్న వారి ఎడల మనం బాధ్యత పడాలి. వారి జీవలక్షణాన్ని అనుసరించి, మనం చేస్తున్న మంచి పనులలో తగిన పనిని వారికి అప్పగించాలి. మన దగ్గరున్న విద్యలలో వారికి తగిన విద్యలను వారికి ప్రసరింపజేయాలి. అంతేకాదు. మన పేరు ప్రతిష్టలలో కూడా వారికి భాగం పెట్టగలగాలి. ఇంకా చెప్పాలీ అంటే ఒక దశకు వచ్చాక, మనం కొంచెం వెనక్కు తగ్గి, మన కొరకని నడిచి

వచ్చిన అవకాశాలను వారికి అందించి, వాటిల్లో వారు రాణించేటట్లుగా చూడగలగాలి. ఇలా, ఇన్ని విధాలుగా తనని తాను సమర్పించుకోవటానికి సిద్ధపడినప్పుడే మనిషి తనను నమ్మి నిలచినవాడిని తీరుగా మలచి, లోకానికి ఒక వెలుగుగా అందించగలుగుతాడు. పెద్దలనబడే వారిలో ఇలాంటి త్యాగబుద్ధి కొరవడినప్పుడు తరువాతి తరం రూపొందదు. వారి పుణ్యమా? అని ఆ జాతి కొన్ని తరాలపాటు దారుణస్థితిని ఎదుర్కోవలసి వస్తుంది. మళ్ళీ ఇంతలో ఎక్కడినుండో ఒక రామానుజుడి వంటి వాడు లేస్తాడు. తాను పాతాళానికి పడిపోయినా సరే, తనతో ఉన్నవాడిని తరింపజేసి తీరతాననంటాడు. అప్పుడు జాతి మళ్ళీ ఊపు నందుకుంటుంది, ఇలా చీకటీ, వెలుగూ ఒకదాన్ని అనుసరించి ఒకటి ఆవరిస్తూ ఉండగా కాలచక్రం తిరుగుతూ ఉంటుంది.

మాష్టారుగారి వదనం నుండి దివ్యమైన గాంభీర్యం వ్యక్తమవుతూ ఉన్నది. వేయవలసిన ప్రశ్న వేసిన నీకు, కావలసిన సమాధానం వచ్చింది కదా!— అని అడుగుతున్నట్లుగా ఉన్నాయా చూపులు.



# పొద్దుపొడుపు కథ

"ఒక రకంగా చూస్తే రామాయణ, భారత, భాగవతాదులు కూడా, జీవిత చరిత్రలు లాంటివే కదా! మాష్టరుగారూ!"

"అవును. అంతేమరి ఆ దృష్టితోచూస్తే అవి చక్కటి జీవిత చరిత్రలే!

"మాష్టరుగారూ! అవి జీవితచరిత్రలైనా అన్ని రకాల వారికీ, అన్ని దేశాలవారికీ, పరిణామంలో అన్ని దశలలో ఉన్న వారికీ, పనికి వచ్చేటట్లుగా రూపొందించబడ్డాయి కదా! మనం ఇవాళ చదువుకుంటున్నా నిత్యనూతనం గానే ఉంటాయి అవి మనకు కావలసినదంతా వాటిల్లో దొరుకుతూనే ఉంటుంది. ఒక వాల్మీకి, ఒక వ్యాసుడు వారి దెలాంటి నైపుణ్యమోగాని, వారే లేకపోతే, వారు వ్రాసిన ఈ జీవిత చరిత్రలే లేకపోతే వేదోపనిషత్తుల [illegible] జీవితాల దాకా, ఈ మన జీవితాలదాకా నడిచి వచ్చేవంటారా? ఈ మన జీవితాలకు ఈనాడు ఈ మాత్రం వెలుగు కనబడుతూ ఉన్నదీ అంటే, ఈ మాత్రం దారి దొరుకుతూ ఉన్నదీ అంటే, అది వారు కట్టుకున్న పుణ్యమే ననిపిస్తుంది నాకు."

"నిస్సందేహంగా."

అలా అంటున్నప్పుడు మాష్టరుగారి కనులు కాంతి గోళాలై, దివ్యమైన వెలుగులను నలువైపులకు ఒక్కసారిగా విరజిమ్మాయి.

"మరి అలాంటి వైభవం ఈ మధ్యకాలంలో వ్రాయబడుతున్న పెద్దల జీవిత చరిత్రలలో ఎక్కడో తప్ప కనబడటంలేదేమిటి మాష్టరు గారూ? తేడా ఏమిటంటారు? ఎందుకని ఈ జీవిత చరిత్రలలో ఎక్కువ భాగం రామాయణ, భారతాల్లాంటి ఉన్నతస్థితిని పొందలేక పోతున్నాయి? ఎందుకని మానవ జాతి కంతటికీ మార్గదర్శకం కాలేకపోతున్నాయి?"

మాష్టరుగారు చిరునవ్వునవ్వి ఇలా అన్నారు: "ఎక్కడికైనా బయలుదేరుతున్నానూ అంటే నాకు మొదట గుర్తుకొచ్చేది నువ్వే ఎందుకనీ అంటే ఆ ప్రయాణకాలం ఎలా సద్వినియోగం చేయాలో, నీవు బాగా తెలిసిన వాడివి కనుక. ఇదే నేస్థానంలో ఇంకొకరు ఉన్నారనుకో వాళ్ళకు సంబంధించిన గోడు ఏదైనా ఉంటే వెళ్ళబోసుకుని ఉండేవారు అదంతా వాడితృప్తికోసం నేను వినివుండేవాడిని. ఎందుకని అంటే వాడి గోడు అసలు నాకు తెలియకపోతేకదా! ఏదో వాడు తృప్తిపడతాడు కదా! అది వినటం.

ఇంకొకడైతే, అంటే మొదటి వాడికన్నా కొంచెం తెలివైనవాడన్న మాట. వాడేం చేస్తాడూ? వాణ్ణి గురించితప్ప, అందరి గురించి చెపుతాడు. వీడిలాగ, వాడిలాగ అంటూ. అదీ వింటాను. తప్పదు కదా! వాడు చెపుతున్నవన్నీ వింటూ, వాటిని బట్టి వాడెలాంటివాడో చూస్తూ ఉంటాను.

ఇంకొక డుంటాడు వాడు ఈ రెండూ కాకుండా, మాష్టరుగారికి కాస్త కంపెనీ ఇద్దామన్నట్టుగా ఉంటాడు. ఏదో సరదా కబుర్లు చెబుతూ ఉంటాడు అవీ, ఇవీ అన్నీ. అలా గాలిని పోగుచేస్తూ ఉంటాడు. నేను వాడితోనూ శ్రుతి కలుపుతూ ఉంటాను. కాసేపు వాడితో కలిసి నవ్వుకుంటాను. కాని ఆ నవ్వులు దిగువ మనస్సునుదాటి పైకి వెళ్ళేవి కావు.

మరొకడుంటాడు గతంలో తన ఘనతనంతా నాతోచెప్పి మురియటానికి ఈ ప్రయాణాన్ని వినియోగించుకుంటాడు. "అమ్మయ్య! నేనెంతవాణ్ణో మాష్టరు గారికి ఇన్నాళ్టికి చెప్పుకోగలిగాను కదా!" అనుకుని తృప్తిపడిపోతాడు. అదీ వింటాను. వింటూ వాడి కండూతిని కాస్త తీరుస్తాను. కండూతి అంటే దురద గదా! ఎవరిచేతనైనా గోకించుకోనైనా గోకించుకోవాలి. లేదావాడే, "చూడండి నా ప్రతిభ" అంటూ గోక్కుంటూ

కూర్చోవాలి ఇదీ, అదీ కాకుండా ప్రక్కవాడికి రుద్దుకొని, ఆ దురదను తీర్చుకునే ప్రయత్నం వేసేవాళ్ళూ ఉంటారు. ఆ కీర్తి కండూతియొక్క లక్షణమే అలాంటిది. అలా గతమెంతో ఘనకీర్తి కల వోణ్ణోయ్" అన్నట్లుగా చెప్పుకొంటూ ఉంటాడు వాడు ఇలా ఎన్నో రకాలుగా కాలక్షేపం చేసే వాళ్లు ప్రయాణాల్లో ప్రక్కన చేరుతూ ఉంటారు. ఆ చేరేదేదో నీక్క చేరితే బాగుంటుంది కదా! అనిపిస్తుంది నాకు. ఇదిగో ఇలాంటి ప్రశ్నలు వేస్తూ మనిషి మెదడుకి పనిపెట్టగలవు కనుక.

ఇక, నీవడిగిన అంశానికి వద్దాం. వాల్మీకి, వ్యాసులు జీవితచరిత్ర లను వ్రాసేటప్పుడు దర్శనాత్మకంగా వ్రాసారు. ఉన్నది ఉన్నట్లుగా చూసి వ్రాసారు. నిర్మమంగా వ్రాసారు. వారి జీవితాలను, జీవితాలుగా గాక, ధర్మాచరణ కేంద్రాలుగా దర్శించి వ్రాసారు. "ఆ ధర్మాచరణమ"నే ప్రయోగం ఎన్ని కోణాలనుండి చూపించవలసిన అవసరం ఉన్నదో అన్ని కోణాలనుండీ, అంతగానూ చూపిస్తూ వ్రాసారు. చదువరిని దృష్టిలో పెట్టు కొని, అతని శ్రేయస్సు కోరి వ్రాసారు. వారు ఋషులుకనుక అలా వ్రాసారు ఋషులైనవారు ఇప్పుడున్నా అలాగే వ్రాస్తారు. అలా వ్రాయ బడిన గ్రంథాలు చిరంజీవాలుగా నిలబడిపోతాయి. చిరకాలం మానవ జాతికి మార్గాన్ని చూపిస్తూనే ఉంటాయి.

ఇక, నీవు చెప్పిన ఇప్పటి జీవిత చరిత్రలున్నాయే, వీటిలో ఎక్కువ భాగం దర్శనాత్మకంగా కాక, ఆవేశాత్మకంగా సాగుతున్నాయి. ఆ ఆవేశం వెనక ఒక మమకారం, అదేమిటీ అంటే, మనకు నచ్చిన ఈ మహాప్రభావుణ్ణి, ఒక మహోన్నతమైన వ్యక్తిగా, ఒక అవతారమూర్తిగా ఈ లోకంలో ప్రతిష్ఠ చేసెయ్యాలి." అని. ఈయనంతటివాడు మరొకడు లేడని నిరూపించాలని. ఒక లోకాతీతమైన వ్యక్తిత్వంగా అతడిని గూర్చి లోకానికి తెలియజెప్పి, అతడి దగ్గరికి మరిందరిని ఆకర్షించాలని, ఒక

మమకారం. ఒక కోరిక. ఒక తాపత్రయం ఒక ప్రయత్నం. కనక యీ రచనలు పరిమితత్వాన్ని పొందుతున్నాయి. కేవలం ఆ పెద్దవాళ్ళకు దగ్గరైనవారుమాత్రమే చదువుకొని ఆనందించడానికి పనికి వస్తున్నాయి. దగ్గర కాని వాళ్ళకి అవి ఏమిటోగా ఉంటున్నాయి. మరి, ఇప్పుడు వారు సాధించదలచిన ప్రయత్నం ఏమయినట్లు? అయినా వారు చేస్తూనే ఉన్నారు. అలా ప్రయత్నించటంలో వారికి ఆనందమున్నది కనుక. అప్పుడిన్ని స్తోత్రపాఠాలు అనబడతాయి కాని జీవిత చరిత్రలు అనబడతాయా? ఆలోచించాలి

ఇంకొక చిత్రం. రామాయణం, భారతం, భాగవతం వీటిల్లో నాయక పాత్రధారి ఎంత స్పష్టంగా కనబడతాడో, మిగిలిన పాత్రలు కూడా అంత స్పష్టంగానూ కనబడతాయి. ఆ పాత్రలు కాసేపే ఉండవచ్చు.కాని మన మనస్సుపైన అవి చెరగనిముద్రవేస్తాయి.రామాయణంలో ఒక మందర, ఒక గుహుడు, ఒక శబరి ఎంతసేపు కనబడతారు మనకి? కాని వారిని లోకం మరచిపోగలదా? దార్శనికమైన రచన అలా ఉంటుంది ప్రతి పాత్రయొక్క జీవలక్షణాన్ని సువ్యక్తంచేస్తూ, సాగుతూ ఉంటుందది. నేను చెప్పిన ఈ ఆధునికమైన రచనలున్నాయే వీటిలో ఎక్కువచోట్ల ఆ నాయకుడు తప్ప ఇంకెవరూ కనబడరు. ఎంతసేపూ ఆ నాయకుని చుట్టూ కథనడుస్తూ ఉంటుంది మిగతా పాత్రలొకవేళ ఉన్నా కేవలం ఈ నాయకుడి గొప్పతనం విప్పి చెప్పటానికే ఉంటాయి. ఆ నాయకుడికితప్ప మిగిలిన ఏ పాత్రకూ వెన్నెముక కనబడదు. పడుము నిలబడదు. ఈ రచయిత నిలబడనివ్వడు నిలబడితే ఆ నాయకుడికి ఎక్కడ ప్రమాదం వస్తుందోనని భయం, పిడికి. ఇంక చరిత్ర ఏముంటుంది? జీవిత మేమిటుంటుంది? కొన్ని పొగడ్తలు కొన్ని కేరింతలు. కొన్ని పులకింతలు. కొన్ని లీలలు. అయితే ఆ పెద్దల జీవితాలలో ఇవి లేవని కాదు. ఇవి మాత్రమే వాళ్ళ జీవితాలు కావు, అని చెప్పటం.

మన పెద్దలు రామ, కృష్ణాది అవతార మూర్తుల గురించి వ్రాసే టప్పుడు కొన్ని చిత్రమైన నియమాలను పాటించారు. వారంటే ఏమిటో మనకు తెలియజెప్పే సన్నివేశాలను ప్రత్యేకించి కూర్పు చేసి ఇచ్చారు అవి వారిలోని ఎత్తులను చూపేవిగా కాక, వారిలోని లోతులను చూపేవిగా ఉండేటట్లు శ్రద్ధ వహించారు. ఇప్పటి వారిలో ఎక్కువ మంది లోతులను చూపే సన్నివేశాలపైన దృష్టిని పెట్టలేక పోతున్నారు. ఎత్తులను చూపే సన్నివేశాలను మాత్రమే రికార్డుచేసి ప్రజలకందిస్తున్నారు. ఎత్తులను చూపే సన్నివేశాల వల్ల వారి గొప్పదనం తెలుస్తుంది ఓహో! వారు ఇంతటి, వారు కదా! అనిపిస్తుంది. లోతులను చూపే సన్నివేశాల వల్ల వారి జీవన విధానం మనకు బోధపడుతుంది. జీవిత నిర్వహణలో వారు పాటించే విలువలు ఎలాంటివో, మనకు తెలిసి వస్తుంది. తద్వారా మన జీవితాలలో కూడా అలాంటి విలువలను నెలకొల్పు కుందాము. అనే బుద్ధి కలుగు తుంది. అందువల్ల జాతి మొత్తం మళ్లీ పట్టాలపైకి ఎక్కుతుంది. రచయితలు ఈ సత్యాలను గ్రహించాలి.

రామాయణంలో రాముణ్ణి ఎంతమంది కలుసుకుని ఉండరూ! కాని వాల్మీకి ఒక గుహుణ్ణి చూపిస్తాడు. ఒక అహల్యను చూపిస్తాడు మళ్లీ ఒక అనసూయను చూపిస్తాడు. ఒక శబరిని చూపిస్తాడు. ఇలా రాముడి లోని లోతులను తడిమి చూపే సన్నివేశాలను కన్నులకు కట్టిస్తాడు. కృష్ణావతారంలో కూడా లీలలు వర్ణించబడినా, అవి కృష్ణుడిలోని లోతు లను తెలియజెప్పే లీలలు మాత్రమే. గోవర్ధనగిరి ఎత్తాడు. కాళీయుని మర్దనం చేసాడు. తానే గోపాలకుల అందరి రూపాన్ని ధరించి వాళ్ళ అందరి ఇళ్ళకు చేరుకున్నాడు. ఇలాంటి సన్నివేశాలున్నాయే, ఇవి కేవ లం కృష్ణుని యొక్క శక్తియుక్తులను తెలియ జేసేవి మాత్రమే కావు. ఒక్కొక్క లీల వెనుక, ఒక్కొక్క అర్ధవంతమైన కథ ఉన్నది. ప్రేమతో నిండిన శ్రీకృష్ణుని హృదయమున్నది. ఆ లీలల నతడు కర్తవ్యంగా ఆచరించాడు తప్ప, వైభవంగా చూపించినట్లు లేదు. గోవర్ధనగిరి నెత్తు

తున్న కృష్ణుని తలుచుకుంటే, ఓహోహో కృష్ణుడు కొండ నెత్తాడు కదా! అనిపించదు. కృష్ణుడు తన వారిని అలా బాధ్యతపడి రక్షించు కున్నాడు కదా! అనిపిస్తుంది. కాళీయ మర్దనం చెప్పుకుంటుంటే కృష్ణుడంతటి పామును మర్దించాడు కదా! ఎంతటివాడు! అనిపించదు. కాళీయునిచే విష పూరితం చేయబడుతున్న సరస్సులో తనవారి కొరకు అలా ఒక్క ఉదు టున దూకాడుకదా! అనిపిస్తుంది. "గోపాలకుల రూపాలు ధరించాడు, అన్నప్పుడు ఓహోహో! కృష్ణుడి దగ్గర ఇంతటి దివ్యశక్తి ఉన్నదా? అనిపించదు. "ఆ గోపబాలుర తల్లిదండ్రులకు బిడ్డలు అందుబాటులో లేరన్న బెంగ కలుగ కూడదు" అన్న అతని ప్రేమమయ హృదయమే దర్శన మిస్తుంది. కనుక భాగవతంలో లీలలు వర్ణింపబడినా అవి లోతు లను తెలియజెప్పే లీలలు. మన హృదయాలను కరిగించే లీలలు. ఋషి సంప్రదాయం అది అలా వ్రాయాలి పెద్దల జీవితాలను గురించి వ్రాసేటప్పుడు. ఎత్తులను తెలియజెప్పే రచనల వల్ల ఆశ్చర్యం కలుగు తుంది తప్ప, అనుభూతి అంతగా కలుగదు. కనుక రచయితలు చదు వరులను ఆశ్చర్యపరచ దలుచుకున్నారో, అనుభూతిలోనికి తీసికొని వెళ్ళదలుచుకున్నారో ఆలోచించు కోవాలి పెద్దల జీవిత చరిత్రలను వ్రాసేటప్పుడు, వారి జీవిత విధానం ఎలాంటిదో పరిశీలించి, దానిని ప్రజ లకు తెలియ జెప్పటం రచయితల బాధ్యత అప్పుడు రచయితలు తాము తరించి, చదువరులను తరింపజేయ గలిగిన వాళ్లు అవుతారు.

పెద్దల జీవిత విధానానికి రచయితలు దర్పణం పట్టగలిగి నప్పుడు ఆ రచనలను దేశకాలాల కతీతంగా, సర్వజనులు స్వీకరించి, శిరస్సున ధరిస్తారు. పెద్దల వైభవాలను మాత్రమే రచయితలు రికార్డుచేసి ఇచ్చి నప్పుడు, అవి ఆ పెద్దలకు సన్నిహితంగా మెలుగుతున్న వారు మాత్రమే చదువుకొని తాత్కాలికంగా మురుసు కుంటారు.

మాష్టరుగారు నాలోనికి సూటిగా చూస్తున్నారు.

"నీవడిగిన ప్రశ్నకు సమాధానం పూర్తిగా వచ్చిందా?— అన్నట్లుగా.

కారు మెదక జంక్షన్ సమీపిస్తున్నది ఏలూరు నుండి బయలు దేరి మేము కొద్దిసేపట్లో బంధరు చేరుకో బోతున్నాం అసలు ప్రయా ణం జరిగినట్లే అనిపించలేదు. ఏలూరులో బయలుదేరి నప్పటి నుండి ఏవేవో లోకాలలో అలా విహరింప జేస్తూనే ఉన్నారు మాష్టరుగారు. ఈ ప్రయాణమే కాదు. వారితో ప్రయాణం చేయగలిగితే జీవిత ప్రయా ణమైనా అలాగే ఉంటుంది మరి.

కొద్దినిముషాలు అనుభూతి ప్రదమైన నిశ్శబ్దం రాజ్యమేలింది.

ఆ అనుభూతిని అలాగే సాగనిస్తూ మాష్టరు గారిలా అన్నారు:

"ఏమి స్వామీ! అంతా నాచేతే చెప్పింలావ్ ఇంతకీ నీకేమనిపించిందో చెప్పావు కాదు!

చెబుదామనే ప్రయత్నంలోనే ఉన్నాను. మీరు చెప్పింది అ సాంతం విన్న తరువాత, మీరు చెప్పిందే గుర్తుకొచ్చింది నాకు.

ఏమిటది! పొరపు కథలాగా చెపుతున్నావ్.

అవును. పొరపు కథే. ప్రొద్దు పొరపు కథ ఇది. మీరేమన్నారు. నా ప్రశ్నకు జవాబు పలికే ముందు మీరేమన్నారు? మొత్తం మనిషికి పని చెప్పేవాడు కావాలి." అన్నారు. ఏం తేల్చారు? చివరకు ఏం తేల్చారు మరి? మొత్తం మనిషిని పట్టివ్వగలిగిన వాడే నిజమైన రచయిత." అని. అంతేనా?

అమ్మదొంగా! ఏం చెప్పావ్? ఉండవలసిన వాడివయ్యా! నువ్వు. బాగుంది సమాధానం బాగుంది. నిజమే నీవన్నది. నీవన్నది నిజమే.

ఒకరి నొకరు అలా చూస్తూనే ఉన్నాము.

కారు అలా సాగుతూనే ఉంది.

కాలం అలా కదులుతూనే ఉంది.

కదులుతున్న కాలమా? ఇది.

కథలతో నున్న కాలమా?

కనులముందు కథలు కదిలే కాలమా?

# రాముని భజనకు

అదిగో జన సమూహం. అదే "ప్రతివాద హారం" అని ఆ జన సమూహాన్ని బట్టే తెలుస్తోంది. వేరే మనం ఎవరినీ అడుగ నక్కరలేదు. అంటూ చూపుడు వ్రేలితో ఆ జనసమూహాన్ని చూపిస్తూ మందస్మిత వదనంతో వారిని నోరార స్మరించి, ఇంకా పూర్తిగా కారు దిగకుండానే ఆ గ్రామవాసుల్ని ధన్యుల్ని చేస్తున్నారు మాష్టరుగారు.

కేరింతలతో పై కండువాలను పైకెగరేస్తున్నారు జనం. అదిగో ఈ కారు మాష్టారు ఉన్నదే. అని వారికి తెలిసిన క్షణం.

కారు నుండి దిగుతున్న మాష్టరుగారిని చుట్టు ముట్టుకుంటున్న జన హారం ఆయన కౌగిలి లోపల ఒక వైపున రెడ్డి లక్ష్మి నాయుడు, మరొక వైపున పురాణం రాజుగారు వారిరువురు మాష్టరుగారి కౌగిలిలో తాము ఇమిడినందుకు పులకించిపోతూ ఉండే "ఆయన చుట్టూ తానై" ఆయననలా చుట్టుకుంటూ విశేషమైన తన కౌగిలిలో ఇముడ్చుకోగలిగాను కదా! అని పొంగి పొరలి పోతున్నది. ఆ జన సముద్రం.

అలా కొద్ది నిముషాలు గడిచింది కాలం కూడా ఆదృశ్యాల్ని చూస్తూ తనను తాను కాసేపు అదమరచిపోయిందేమో అన్నట్లుగా అలరారుతున్నది ఆ గ్రామం యొక్క పొలిమేర.

జనసాగరం పరవళ్ళు తొక్కుతున్నది. ఎగిరెగిరి పడుతున్నది. తనలో తాను ఇమడి ఉండటం చాలా కష్టమనిపిస్తున్నది దానికి.

ఇదిగో! రాముడు ముందుకు సాగాలి అంటే జన సముద్రం దారిని ఇవ్వాలి. అంటూ తనపైకండువాని గాలిలో అటూ, ఇటూ ఊపారు పురాణం రాజుగారు.

సముద్రం విన్నది. "పరవశం చెందుతూనే దారి నిచ్చింది." కాని వేరే వారధి వద్దు. "నా మీదుగా నాతోడుగా రాముడు సాగాలి." అన్నది.

అలా తమ హృదయాలను వరుసగా క్రింద పరచి, వాని మీదుగా మాష్టరుగారిని నడిపించుకుంటూ ముందుకు సాగారు ఆ ప్రజలు.

సాగబోతున్న మాష్టరుగారిని, వినమ్రతతో చూస్తూ, కారు ఇంటి దాకా వెళుతుంది అన్నారు లక్ష్మీనాయుడుగారు.

"లేదు ఇలాగే సాగుదాం. అందరం కలిసి ఇలాగే సాగుదాం" అన్నారు మాష్టరుగారు.

"ఆహాహా! ఈ దృశ్యం అపూర్వం. ఈ మాటలు మధురాతి మధురం. మా రాముని గుండె ప్రేమమయం! అంటూ కన్నులు పెద్దవి చేసి ఆ దృశ్యాన్ని మరింగా చూడసాగారు రాజుగారు.

నడిచినట్లేలేదు. ఇంతలో నాయుడిగారి ఇల్లు వచ్చేసింది.

నిజానికి ఆయన నడవలేదు ప్రజలు ఆయనను నడిపించుకొని తీసుకు వెళ్లారు

విష్ణుమూర్తిని దిగిరమ్మని భూదేవి కోరటమంటేటారే! ఆ దృశ్యం ఇలాగే ఉంటుందేమో!

"మాష్టరుగారూ! ఇటు ఇటు" అంటూ పెద్దగా పిలిచాడు లక్ష్మీనాయుడి పెద్దకొడుకు.

పిలుపుకు తలపైకెత్తిన మాష్టరుగారికి నమస్కార ముద్రతో కనిపించాడు లక్ష్మీనాయుడు. రాజుగార్లు కూడా అటు చూసారు.

"నాన్నా! మాష్టరు గార్ని ఇటు తీసుకొచ్చేయండి ఏకంగా. ఇక్కడన్ని ఏర్పాట్లు సిద్ధంగానే ఉన్నాయి అన్నాడతను.

"పదండోయ్! మన చిన నాయుడు పిలుస్తున్నాడు" అంటూ మాష్టరుగారు మెట్లవైపుకు దారి తీసారు

మాష్టరుగారు పైకెక్కుతున్నారు. చిననాయుడు క్రిందకు దిగుతూ మాష్టరుగారికి ఎదుర్కోలు సన్నాహం చేస్తున్నాడు. చిననాయుడి చేతులు పట్టుకొని, అతణ్ణి నడిపించుకుంటూ మాష్టరు గారు పైకి సాగారు

"మాష్టరు గారూ! ఇలా—ఇలా రావాలి మీరు ఈ కుర్చీలో మీరు కూర్చోవాలి. అన్నాడు చిన్ననాయుడు

" నా ఇంట్లో నేనెక్కడ కూర్చుంటేనేంటోయ్?" అన్నారు మాష్టరుగారు.

"ఈ ఇల్లూ, ఈ ఊరూ ఎప్పటికీ మీవే మాష్టరుగారూ! మేమంతా మీ బిడ్డలం, ఆ అనుబంధం. ఆ తృప్తితోనే బ్రతుకుతున్నాం మేమందరం. అయినా తండ్రిని ఇలా కూర్చోపెట్టుకోవాలని అనిపించటం సహజమే కదా! కనుకనే ఇలా ఇక్కడ కూర్చోమంటున్నాను.

"నాయుడూ! నన్ను కట్టేస్తున్నావు నువ్వు అన్నారు మాష్టరు గారు.

"ఎంతమాట! మిమ్మల్ని కట్టేయటమా? అదెలా సాధ్యం? లేదు మీరే కట్టుబడిపోతారు. ప్రేమున్న చోటున ఒదిగి పోతారు మీరు అలా ప్రేమకు కట్టుబడే లక్షణమే మీకు లేకుంటే, ఈ శ్రీకాకుళంజిల్లాలో, ఈ మారుమూల గ్రామానికి ఇన్నేళ్ళుగా ఇంత అదృష్టం పడుతుందా? ఎన్నో ప్రాంతాల్లో ఎన్నో గ్రామాల్లో ఏటేటా రామనవమి జరుగవచ్చు. నవరాత్రులు నడవవచ్చు. కాని ఈ ప్రత్తివాడుపేటలో జరిగే ఈ రామనవమి ఇది చిరకాలం చరిత్రలో నిలబడి పోతుంది. మిగిలిన చోట్ల నవరాత్రులలో రాముడు విగ్రహరూపంలో వెలిస్తే ఇక్కడ మాత్రం ఈ తొమ్మిది

రోజుల్లో ఏదో ఒక రోజున, ఇలా మానవ రూపాన్ని ధరించి, మా మధ్య నిలుస్తాడు. మాతో కలుస్తాడు. మాలో ఒకడై, మా వాడిగా మసలుకుంటాడు. ఇది మా అదృష్టం ఇది మా దేవుడికి మాపై గల వాత్సల్యానికి ఒక సంకేతం.

అలా అంటున్న చిననాయుడి రెండు భుజాలపై తమ రెండు చేతుల్ని వేసి దగ్గరకు తీసుకున్నారు మాష్టరు గారు

లక్ష్మీనాయుడి కళ్ళల్లో చెప్పలేనంత పారవశ్యం నిండి, చూపై వెలుగులోంది.

అది గమనించిన పురాణం "రాజుగారు తన బిడ్డను మీ అక్కున చేర్చిన లక్ష్మీనాయుడు ధన్యుడు" హరి చేరు మనియెడి తండ్రి తండ్రి.

లక్ష్మీనాయుడి కన్నులనుండి ఆనందబాష్పాలు రాలుతున్నాయి.

చిన్ననాయుడి వెన్నుని మాష్టాగారి చేతులు నిమురుతున్నాయి. రాజుగారి కన్నులు రాజీవాలై విచ్చుకుంటున్నాయి.

దాబాపైన నిండా జనం. ఆడా, మగా, పెద్దా, చిన్నా, ఆబాల గోపాలం అక్కడ కనబడుతున్నది.

'బాబూ! మీరిక కూర్చోవాలి మీరు కూర్చుంటే అందరూ కూర్చుంటారు. అందరి కోసం మీరు కూర్చోవాలి' అన్నారు రాజుగారు.

నడుస్తున్న ఈ నవరాత్రుల కార్యక్రమానికి సారథి ఆయన. పురాణ ఇతిహాసాలన్నింటినీ పుక్కిట పట్టినవాడు. కావ్యాలెన్నింటినో కంఠస్థం చేసినవాడు. ఆ చదువులలోని మర్మమేదో మాష్టరుగారి చెంత దర్శనం పొందినవాడు. తాను పొందటమేకాక, ఆ పొందిన దర్శనాన్ని కొన్ని పదుల గ్రామాలకు పంచి పెడుతున్న వాడు. మాటలను బాణాలుగా సంధించి పల్లె ప్రజల మనస్సులలోని అజ్ఞానపు పొరలను చీలు

స్తున్నవాడు ఈ రాజుగారు. అన్నిటికీ మించి మాష్టరుగారి చేత అల్లుడు రాజుగారు అని పిలువ బడుతున్నవారు ఆదరువృతో ఇప్పుడు ఆదేశిస్తు న్నాడు మాష్టరుగారిని కూర్చోవాలని.

"అల్లుడిమాట వినక తప్పదుగా! పైగా ఇది మా అల్లుడిగారి రాజ్యమాయే! వారు చెప్పినట్లు నడుచుకోవటమే అన్ని విధాలా మంచిదని మేం భావిస్తున్నాం!— అంటూ మాష్టరుగారు ఆసనంపైన కూర్చున్నారు. కొన్ని క్షణాలలో అక్కడ చేరిన వారందరూ కూడా విశ్రాంతిగా కూర్చున్నవారయ్యారు.

ఒకాయన వచ్చి రాజుగారి చెవిలో ఏదో చెపుతున్నాడు.

దానికి బదులుగా, "కొద్ది నిముషాలు ఆగండి. అన్ని ముచ్చట్లూ తీర్చుకుందాం" అంటున్నారు రాజుగారు.

"ఏమిటది అల్లుడుగారూ!"

"ఏమీ లేదు మాష్టరు గారూ, మీరు విశ్రాంతిగా కూర్చోండి"

ఫరవాలేదు చెప్పండి.

"ఏం లేదు. మన వాళ్ళంతా మీకు వరసగా వచ్చినమస్కారాలు చేద్దామనుకుంటున్నారు. నేనేమో మీరు అలసి ఉంటారుగదా! అని కొద్దిగా ఆగమన్నాను.

"అదేమిటది. అయ్యో! ఊ... వాళ్ళ ముచ్చటను మన మెందుకు కాదనాలి? రండయ్యా, రండి. నేనొచ్చిందే మీకోసం. మీ మధ్య నుండగా నాకు అలసటా? అల్లుడుగారు అట్లాగే చెపుతూ ఉంటాడులే మర్యాద కోసం. రండి!" అంటూ మాష్టరుగారు వాళ్లందరినీ తనలోనికి ఆప్యాయంగా ఆహ్వానించారు.

"బాబుది పెద్ద మనస్సు దాన్ని గూర్చి నేనేం చెప్పగలను? మాటలతో చెప్పగలిగేది కాదది. కనుక, ఆయనే రమ్మని పిలుస్తున్నారు కనుక, మనందరం ఒకళ్ళ తరువాత ఒకళ్ళం ప్రశాంతంగా నమస్కారం చేసుకుందాం" అంటూ రాజుగారు నమస్కారాల పర్వాన్ని తన తోనే ప్రారంభించారు ఆబాల గోపాలం ఒకరివెంట ఒకరుగా ఆపాదాల చెంతకు చేరుకుంటున్నారు.

ఒకరి నొకరు తోసుకోరు. ఒకరి కొకరు అడ్డు పడరు. తమ పని అయిపోవాలని తొందరపడరు. మనందరం ఒక్కటే. మనలో ఎవరు దణ్ణం పెట్టినా ఒక్కటే! అన్నట్లుగా సాగుతున్న వారి సంస్కారం ఆ సన్నివేశంలో కొట్టొచ్చినట్లుగా కనబడుతోంది

మాష్టరుగారొకసారి నా కనులలోనికి చూశారు: "చూస్తున్నావా? ఈ దృశ్యాన్ని చూస్తున్నావా ఈ సంస్కారాన్ని? చూస్తున్నావా నీరు కావి పంచెల మాటున, నేత చీరల నిండుదనం మాటున దాగియున్న ఈ జాతి వ్యక్తిత్వాన్ని! అన్నట్లుగా చూశారు.

నమస్కరిస్తున్న వారిలో ఒక్కొక్కరినీ పరిచయం చేస్తున్నారు రాజుగారు ఆ పరిచయాలని వింటూ, నాకు తెలిసినవారే. నావారే. అన్నట్లుగా వారివైపు తృప్తిగా చూస్తూ, వరం పంచేస్తున్నారు. మాష్టరు గారు. ఆ నమస్కారాలలో సహజత్వం ఉట్టిపడుతున్నది సమర్పణ భావం తొణికిసలాడుతున్నది

అందరూ ప్రశాంతంగా కూర్చొని ఉన్నారు రాజుగారు ఇలా అన్నారు: "బాబూ! ఇక్కడ రామాలయముంది కదా! దానిలో ఒక విశేషముంది. మనవాళ్ళు, ఈ గ్రామప్రజలు, రోజూ రాత్రిపూట అక్కడ చేరి, గొంతెత్తి రాముణ్ణి పిలుస్తూ భజన చేస్తారు. సంవత్సరాల తరబడి సాగుతూ వస్తున్న భజన ఇది. అది ఏ ఋతువు కానివ్వండి! ఎలాంటి

సందర్భం కానివ్వండి! ఇక్కడ భజన మాత్రం సాగి తీర వలసిందే. ఒక రోజున నిజంగా పిడుగు పడింది. పెద్ద గాలివాన. కన్ను పొడుచుకున్నా, కంటికి ఏమీ కనబడని స్థితి. ఆరోజున కూడా భజన సాగింది. ఈ ప్రజల ఆర్తి అలాంటిది. వీళ్ళు ఇంత ఆర్తి కలిగిన వాళ్ళు కాబట్టేగా బాబూ! క్షణం తీరికలేని కార్యక్రమాల్లో ఉండే మీరు సంవత్సరానికో రోజు మీతో ఉండి పోతానని మాట ఇచ్చారుగా వీళ్ళకి.

మాష్టరుగారు అర్ధని మీలిత నేత్రాలతో, అర్ధవంతంగా చూస్తూ రాజుగారి మాటలను ఆసక్తితో వింటున్నారు. మాష్టరు గారితో తరలి వచ్చిన విశాఖ సోదరులు ఒక ఆయిదారుగురుంటారు. వారిలో ఇది వరకు పత్తివాడపాలెం వచ్చిన వారికి ఇక్కడి దృశ్యాల గురించి కొంత వరకు అనుభవమయ్యే ఉంటుంది. మిగిలిన వారికి మహదాశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి ఈ దృశ్యాలు – మాష్టరుగారిని మనం రాసుకుంటూ తిరగొచ్చు. పూసుకుంటూ కూర్చోవచ్చు. కాని వీళ్ళలా, ఇక్కడి వాళ్ళలా మనం ఆయనకి అంతగా దగ్గర కాగలిగామా?" అని వారిలో వారికి ప్రశ్నలు ఉదయిస్తున్న సమయమది. ఉద్ధవాదులకు గోపికల దర్శనం జరిగినప్పటి స్థితిలా ఉన్నది.

రాజుగారు ఇంకా ఇలా అన్నారు. "బాబూ! క్రిందటి సంవత్సరం ఒకానొక సమయంలో వర్షాలులేని స్థితి వచ్చింది. గతి తప్పని మన గ్రామ ప్రజలకు ఈగతి ఏమిటి? "అని లక్ష్మీనాయుడు ఆర్తి చెందాడు. నన్ను పిలిపించాడు. "విరాట పర్వం చెప్పాలి." అన్నాడు. అయితే నీవూ శ్రుతి కలుపు అన్నాను. ఇద్దరం కలిసి మీకు దణ్ణం పెట్టుకొని, ఆరాముడి దగ్గర కూర్చుని కథ మొదలు పెట్టాం. ఆయన చదువుతున్నాడు నేను వివరిస్తున్నాను. లక్ష్మీనాయుడు చదవటం మీరు విన్నారు కదా! బాగా చదువుతాడు. నాయుడు అల్లుడు గడ్డి నాయుడు ఉండేవాడు కదా!

అతనూ పురాణం బాగా చదువుతాడు. ఇదిగో ఈ చిన్న నాయుడు- ఇతనూ అలవాటు చేసుకుంటున్నాడు. సరే. చెప్పటం నావంతు. చెప్పటం కూడా మీరే చేయగలరు కదా! అని అంటే వినరు- లేదూ! మీరే చెప్పాలి. అంటారు. నేను మటుకు ప్రత్యేకించి ఏమి చెబుతాను. కాలం కలసి వచ్చి నప్పుడల్లా మీ ఉపన్యాసాలలో విన్నవీ, మీ గ్రంథాలలో చదివినవీ సందర్భానుసారంగా చెపుతూ ఉంటాను. అదిగో ఆ చెప్పటం వచ్చు తుంది వీళ్ళకి. ఇలా నానోటి వెంట మిమ్మల్ని వింటూ ఎప్పుడూ మీతోనే ఉంటున్నారు. వీళ్ళు. అలా మీరు వీళ్ళని అక్కున చేర్చుకుంటున్నారు. ఆచేర్చుకోవటానికి నిమిత్తంగా వినియోగ పడుతున్న ఈ "నేను" ధన్యుణ్ణి

ఇంతకు చెప్పొచ్చేదేమిటంటే ఏరాటు పర్వం పూర్తవుతోందో, లేదో ఎక్కడి నుండి వచ్చేశాయో, మేఘాలు పరిగెత్తు కుంటూ వచ్చేశాయి, పిలిచినట్లుగా. ఇక చూడండి బాబూ! ఆ ఇల్లల్లో కేరింతలు కొడుతున్న ప్రజానీకాన్ని చూడాలి. ఇలా మా లక్ష్మీనాయుడు మీ దయవల్ల గ్రామం యెడల బాధ్యత వహించి ప్రవర్తిస్తున్నాడు. గ్రామమూ అతని కా పెద్దరి కాన్ని ఇస్తూ వస్తున్నది.

"అది సరే బాబూ! ఏదిమన లక్ష్మినాయుడు? ఇక్కడే ఉండాలే! నన్ను మీకు అప్పజెప్పేసి, తనెక్కడికి వెళ్ళాడబ్బా! ఆఁ అదిగో! వచ్చేస్తున్నాడు. క్రింద కావలసిన ఏర్పాట్లన్నీ పూర్తయినాయో, లేదో తానుగా ఒకసారి చూసుకుని వస్తున్నట్లున్నాడు. బాబూ! మీరు కదలి వస్తే గ్రామమే ఒక పెద్ద పెళ్ళివారి ఇల్లుల్లా మారి పోతుంది! ఇక్కడ చూడండి! ఇదిగో ఈ జనం. క్రింద చూడండీ, ఆ ఏర్పాట్లలో ఆ జనం. ఇంక ఆపైన గుడి దగ్గర సభాకార్యక్రమాల్లో మళ్ళీ జనం. ఆనందో త్సాహాలతో ఊగిపోతున్న జనం. ప్రతి సంవత్సరం ఈ రోజు కోసమే, ఈ గ్రామం, ఈ గ్రామాన్ని ఆధారంగా చేసుకుని ఈ ప్రాంతం వేయి

కన్నులతో ఎదురుచూస్తూ ఉంటుంది. ఈ గ్రామాలన్నిందిలోనూ ఈ లోపుక జరిగే మా పురాణ కాలక్షేపాలున్నాయే. అవన్నీ మీరాకకు జనాన్ని సిద్ధం చేయటానికే, మతంగ మహర్షి శబరికి చేసినట్లుగా.

"ఏమిటి బాబూ! సంవత్సరం పొడవునా గ్రామగ్రామాల ప్రజల్ని పారవశ్యంలో ఓలలాడించే మా రాజుగారు ఇలా మీ సన్నిధిలో ఒక పసిపాపలా కేరింతలు కొడుతున్నాడు. "అంటూ దగ్గరయ్యాడు లక్ష్మీ నాయుడు.

"నాయుడూ! నిజంచెప్పు. నీవు మాత్రం ఈ సన్నిధిలో పసి పాపవై పోలేదా!" —అన్నారు రాజుగారు.

నాయుడి కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లాయి. "బాబు సన్నిధిలో పసిపాపలు కాని వాళ్ళెవరు! వయోదోషం చేత చెడిపోతున్న మనందరినీ పసిపాపలను చేసి, తనివి తీరా ఆడిస్తూ వయస్సులకు అతీతంగా ఇలా పసిపాపలుగా బ్రతకండి! ఎందుకలా దేహాల వయస్సుల్ని మీ పైద వేసుకుని, జీవితాలని బరువెక్కించుకుంటారు? చూడండి. దేహాల ఊయల లలో జీవితాంతం పసిపాపలుగా ఆడుకోండి." అని మనందరికీ నేర్పు తున్నారయ్యా, బాబు. అంటూ అలా మాష్టారి ప్రక్కన కూర్చుండి పోయాడు నాయుడు.

మాష్టరుగారి చేయి నాయుడి భుజంపై పడింది నాయుడి శిరస్సు మాష్టరుగారి ఒడిని చేరింది. నాయుడు పసిపాపలా కరిగి పోతున్నాడు. నాయుడి రూపంలో అక్కడ ఉన్నవారందరూ మాష్టరుగారి ఒడిని చేరిన వారై అలా పరవశించి పోతున్నారు.

కొద్ది నిముషాలు అలా అనుభూతి ప్రదంగా దొర్లి పోయాయి. అలా ఒడిలో నుండే చూపులను పైకె మళ్ళించి, ప్రయత్నం మీద

గొంతు తెచ్చుకుని, "బాబూ! క్రిందకు వెళదామా? ఏర్పాట్లన్నీ సిద్ధంగా ఉన్నాయి. ముక్కు మనం వేదిక దగ్గరకు వెళ్ళాలి కదా!

ఇప్పటికే వివిధ ప్రాంతాలనుండి చేరిన జనసందోహంతో సభా ప్రాంగణం మీ కొరకు ఎదురుచూస్తూ ఉంది" అన్నాడు నాయుడు.

ఆ ఒడిలో నుండి లేవాలని నిజానికి అతనికి లేదు. కాని కర్తవ్యం అతనిని లేపుతూ ఉన్నది. అంతటి కర్తవ్య నిష్టుడు కనుకనే ఆ ఒడి అతనిని వరించింది.

మాష్టరుగారితో పాటుగా అందరూ క్రిందకు చేరుకున్నారు. కాళ్ళు కడుక్కొని సేవించకుగాను. పెద్ద ఎత్తున ఏర్పాట్లు. గుండిగలు, గంగాళాలతో, పిస్తరు. పదికొప్పగా చెంబులు. తడుచుకోవటానికి తుండ్లు, అందించటానికి మనుషులు. "ఇక మీరు రావటమే తరువాయి." అని నిండుగా పిలుస్తున్న విస్తళ్ళు. చకచకా సాగుతున్న మాష్టారి నడకలు. కొద్ది క్షణాలలో ప్రతి విస్తరి దగ్గరా ఒక మనిషి. మరి కొన్ని క్షణాలలో మారు వడ్డనలు.

పల్లె ప్రజలు తమ ప్రేమను అలా పళ్ళెంతో పట్టుకొని వచ్చి కొసరి కొసరి వడ్డిస్తున్నట్లుగా ఉన్నది. అలా వడ్డన సాగుతున్న వేళలో. ఇలా మాష్టరుగారికి వేయబోతే "కొంచెం వెయ్యి, అని మాష్టరుగారు అంటే ఆ వడ్డించే ఆడపడుచులు ఎంతగా పరవశించిపోతున్నారో! తమతమ జన్మలు ధన్యమై పోతున్నట్లుగా ఉన్నది వాళ్ళకు. సాధ్యమైనంత వరకు అందరికీ తృప్తి పరుస్తూ, అలాగని తన శరీరానికి ఇబ్బంది కలుగ జేయక, భోజనం చేయటంలో నిపుణతను చూపిస్తున్నారు మాష్టరుగారు. చివరి ఐటమ్‌గా మంచి మామిడి పళ్ళు. ప్రత్యేకంగా ఈ రోజు ఉత్సవం కోసం ఎదురుచూస్తున్న పళ్ళవి

ఎవరో, "ఈ మామిడి పండు రసం గ్లాసులోకి, పిండి ఇవ్వ మంటారా, మాష్టారూ!"—అన్నారు.

"అప్పుడు ఆ మామిడి పండు రుచిని నీచేయి చూసినట్లవుతుంది" – అంటూ మాష్టారు మామిడి పండును నోటికి అందించారు.

బయటనుండి మేళతాళాలు వినబడుతున్నాయి. "బయలు దేరే టందుకు ఇక వేళయిందీ!" అన్నట్లుగా.

చేయి కడిగేటందుకు లేచారు మాష్టరు గారు ఆయనతో అందరూ లేచారు. మళ్ళీ చెంబులూ, తుండ్లు. ఆ ప్రక్కన వక్క పలుకులు, తమల పాకులు.

"మాష్టరుగారూ! మా వంటలు మీకు నచ్చాయా? పదార్థాలు మీరు తిన గలిగేట్లు ఉన్నాయా? ఏవో మాకుతోచిందల్లా, మాకు చేత నయి నట్లు చేశాం. మీ కడుపు నిండిందా? మీ ఆకలి తీరిందా? నిజంగా, నామీద ఒట్టేసి చెప్పండి. ఎవర్నైనా పెట్టి చేయించొచ్చు. కాని ఏమిటో అలా చేస్తే తృప్తి ఉండదు. ఆ బియ్యం ఏరటం దగ్గర నుండి, ఆ కూరగాయలు సేకరించటం దగ్గరినుండి అన్నీ మేముగా చెసుకుంటేనే మాకు తృప్తి. మధ్యలో అనిపించేది" మనం వంట చేసే పద్ధతులు మాష్టారికి సరిపడ తాయా?" అని. కాని మనసే మళ్ళీ బదులు చెప్పేది. "నిండు ప్రేమతో చేస్తున్నాంకదా! అదే మంచి రుచిగా అందులో ఇమిడి పోతుంది"–అని. ఏమిటో, ఎలావండామో, ఎలా చేశామో, మావాళ్ళు తెలిసి చేసిన వంటలు కావివి. మీకు నచ్చాయా? లేక మాకోసం తిన్నారా? ఎలా చేసినా మీరు తింటారు. ఇదేమిటి? ఇలా ఉంది అనే స్వభావం కాదుమీది. మరి మాకెట్లా తెలుస్తుంది మీకు నచ్చిందో లేదో?–అంటూ మంద్రంగా అడుగుతూ ఉన్నది. నాయుడి గారింటి ఆడపడుచు, మాష్టరుగారి భోజనము చూపుల తోనే నిముచుతూ.

మాష్టరుగారు ఆమె నెత్తిపై చిన్న మొట్టికాయ వేసి, "ఏయ్! నేను తిన్నానో లేదో నీకు తెలియదా? నువ్వే కదా వడ్డించిన వాళ్ళలో ప్రధాన మైన దానివి. మళ్లీ మళ్లీ అడిగి వేయించుకున్నానా లేదా?" — అన్నారు.

"అదే నేను మాయంటున్నది. ఆ వేయించు కున్నది నాకోసమా? మీ కోసమా?" అని అన్నదామె

"ఇద్దరి కోసం." సరిపోయిందా? పిచ్చిదానా! పదార్థానికి రుచి కేవలం పదార్థాన్ని బట్టి రాదు. అది తయారుచేసే హృదయాన్ని బట్టి కూడా ఉంటుంది. నీవెలాంటి హృదయంతో చేశావో, నీకు తెలిసి నప్పుడు మళ్ళీ నన్ను ప్రశ్నిస్తావేం? ఆ వంటలు చాల బాగున్నాయ్. వడ్డన ఇంకా బాగుంది. మీరిప్పుడు వెళ్ళి రెడీగా ఉన్న ఆ విస్తళ్ల దగ్గర కూర్చుని భోజనం చేస్తే ఇంకా బాగుంటుంది. పద. పద. నేనూ వడ్డిస్తాను నీకు."

"మీరు వడ్డించటమా?"

"ఏం? వడ్డించకూడదా?"

"అంతకంటే అదృష్టం ఇంకేమయినా ఉందా?"

"అదేమో గాని. ఇలా మీ మధ్య గడపటంలో గల హాయి మాత్రం నాకు ఇంకెక్కడా లేదు, బస్తీలలో మసుగుతున్న మనస్సుల మధ్య వేగిపోయిన వాడిని. ఇలా పల్లెపట్టున, మీ హృదయభాండాల్లోంచి, అమృతాన్ని జల్లుతూ, సేద తీరుస్తూ వున్నారు మీరు. మరి ఇప్పుడు చెప్పు. ఇంతకంటె హాయి ఇంకెక్కడ వుంటుంది? మళ్ళీ బస్తీలలో

సంవత్సరం దాకా పనిచేసేటందుకు కావలసిన పెట్టుబడిని కూడా ఇచ్చి పంపిస్తున్నారు మీరు. అందుకోసమే వెతుక్కుంటూ వస్తాను." ఇక్కడికి. ప్రేమున్నచోటుకు చేరకుండా ఎవరుండగలరు!" అంటూ ఆమెను అక్కున చేర్చుకుని లాలించారు మాష్టరుగారు. అలాగే నడిపించుకుంటూ తీసుకువెళ్ళి విస్తరి దగ్గర కూర్చోపెట్టారు. చివరి పంక్తి భోజనాలు ప్రారంభమైనాయి. ఊరంతా కన్నులు పెద్దవి చేసుకుని, మాష్టారి దర్శనం కోరకు ఎదురు చూస్తూ వున్నది.

ఊరు ఎలా ఎదురుచూస్తూ ఉందో చెప్పటానికి వస్తున్నారు నాయుడుగారు.

వస్తున్న నాయుడుతో, "ఇక బయలుదేరదామా : సభాస్థలికి" అన్నారు మాష్టరుగారు.

నాయుడు ఉప్పొంగిపోయాడు. ఆ ఉప్పొంగటం ఎలా ఉన్నదో అక్కడ మ్రోగింపబడుతున్న మేళతాళాలలో తెలిసి వస్తూ ఉన్నది.

మాష్టరుగారు ముందుకు అడుగువేశారు. ప్రజలు ఆయనతో కదిలారు. ఆయన కాళ్ళకు సూటిగా తెల్లటి బట్టలు పరవబడ్డాయి. ఆ బట్టలపైన నడిపిస్తున్నారు మాష్టరుగారిని. బట్ట తరువాత బట్ట అలా ఆ బాట అంతా మల్లెపూవుల లాంటి తెల్లని బట్టలతో సాగుతూ ఉన్నది. ఆ తెల్లటి బట్టలు మాష్టారి పాద ముద్రలను తమలో ఇముడ్చుకుంటున్నాయి. ఆ ముద్రలు మామీదనే పడాలి అంటూ చకా చకా వాలిపోతున్నాయి.

బాటలోన బట్టలపైన సాగుతున్నారు మాష్టరుగారు. ఆయనకు ఇరువైపులా జనం. ఆయన కాళ్ళకు అడ్డం పడకుండా, ఆయన కొరకై పరచుతున్న బట్టలను తామాక్రమించకుండా, అలా నమస్కార ముద్రలు పెట్టి సాగుతూ ఉన్నారు. వినయత ఉన్న చోట క్రమశిక్షణ దానికదిగానే వస్తుందేమో! వివేకం దానికదిగా వెలుగుతుందేమో! విచక్షణ దానికదిగా కలుగుతుందేమో! చదువు సంధ్యలకు అంతగా నోచుకోని ఆ పల్లెసీమలో సంస్కారం కొట్టవచ్చినట్లుగా కనబడుతున్నది. ఈ చిత్రం ఆలోచించదగినది ఈ సత్యం గమనించ దగినది.

తెల్లటి బట్టలలో విరాజిల్లుతున్న మాష్టరుగారు, అలా తెల్లటి బట్టలపైన సాగుతూ ఉన్నారు ఆయనకు అటూ ఇటూ వెలిగించి పట్టుకొని ఉన్న పెట్రొమాక్స్ లైట్లు సాగుతున్నాయి. వెన్నెల రోజులలో చుక్కల మధ్యనుండి చంద్రుడు సాగుతున్నట్లుగా బంగారు వంటి ఒంటికాంతితో ప్రసన్నవదనులైన మాష్టరుగారు చిరునవ్వుల వెన్నెలను అందరిపై వెద జల్లుతూ, ఆ ఎదలన్నింటినీ పులకింపజేస్తూ, సభావేదికను సమీపిస్తున్నారు.

సభావేదికను సమీపిస్తున్న వేళలో, ఆ వేదికను అంటిపెట్టుకుని ఉన్న గుడినుండి ఒక భజన గీతం ఇలా వినిపిస్తున్నది. "రాముని భజనకు రమ్మని పిలువా రాలేననకే ఓ మనసా" అని మాటిమాటికీ అంటూ చరణ చరణానికీ, ఆర్ద్రంగా హెచ్చరిస్తూ సాగుతున్నదా గీతం.

నాయుడు ఒక్కసారి మాష్టరుగారివైపు చూశాడు. రాజుగారు నాయుడి భుజంపై చేయి వేశారు నాయుడూ, రాజుగారూ కలిసి జన

సందోహంవైపు చూశారు. ఈ వచ్చి చేరిన జనులు అదృష్టవంతులు. వారికి రామదర్శనం ప్రాప్తమున్నది. వద్దామనుకుని రాలేకపోయిన వారెందరో! అసలు వద్దామనుకున్న వాళ్ళందరూ వచ్చేస్తే ఈ గ్రామం సరిపోతుందా? ఆఁ. మన పిచ్చి గాని, ఎందుకు సరిపోదు. నిండుగుండెలో చోటుకు కరు వుంటుందా? ఆ వద్దామనుకుని రాలేకపోతున్న వాళ్ళకై కాబోలు ఈ గీతం సాగుతున్నది. ఏమని? "రాముని భజనకు రమ్మని పిలువా రాలే ననకే ఓ మనసా!" అని, నాయుడూ రాజుగారూ ఒకరినొకరు చూసు కున్నారు. "మన గుండె చప్పుళ్ళకు అర్థం ఇదే కదూ!" అన్నట్లుగా. అవునన్నట్లు తల లూచుకున్నారు.

జనసముద్రంలో నుండి ఉదయించి పైకి వస్తున్న చంద్రుడై మాష్టరుగారు వెలిగిపోతున్నారు, ఆ వేదికను ఎక్కే వేళలో, తననుంచి ఉదయించిన చంద్రుణ్ణి చూసి, సముద్రం ఎగసి ఎగసి పడినట్లుగా, జనం మాష్టరుగారిని చూస్తున్న ఆ తరుణంలో తమకు కలుగుతున్న ఆనందాతిరేకతను అదుపు చేసుకోలేకపోతున్నారు. ఎంత ఎగసి ఎగసి పడినా, సముద్రం చెలియలి కట్టను దాటదు కదా! అలాగే గ్రామప్రజలు కూడా కాసేపటికో బారులుతీరి కూర్చొనగలిగారు.

"ప్రజలంతా కూర్చున్నారు కదా! వాతావరణం దివ్యంగా ఉందిప్పుడు అదిగో. సంకీర్తన బృందం కూడా వచ్చి కూర్చుని బాబు గారి సందేశానికై వేచి చూస్తున్నది. సంవత్సరమంతా గుడిలో మనం కొలుస్తూ వస్తున్న దేవుడు సంవత్సరంలో ఈ ఒక్కరోజు మానవ రూపాన్ని ధరించి, తానుగా మన మధ్య నిలుస్తాడు. "సంకీర్తన పరు లారా! మీ సంకీర్తనకు ఫలం ఇదిగో. స్వీకరించండి."— అంటూ రాజు గారు మాష్టరుగారి సందేశానికి నేపథ్యాన్ని రూపొందించారు.

మాష్టరుగారు లేచి, "హరిః ఓం" అంటూ గొంతెత్తారో లేదో, సభా ప్రాంగణమంతా మొత్తంగా ఎక్కడికో చెప్పలేనంత ఎత్తుకు తీసుకు వెళ్ళబడింది.

"ఈ గ్రామమొక మిథిల లక్ష్మీనాయుడు జనకుడు. ఈ మా అల్లుడు రాజుగారు ఈ గ్రామానికి రామునితో అనుసంధానం చేసే విశ్వామిత్రుడు. ఇది ఒక కమనీయ దృశ్యం. తరతరాల పుణ్యఫలం.

వేదికను సమీపించేటప్పటికి కీర్తన ఒకటి వినబడుతున్నది. ఏమని? "రాముని భజనకు రమ్మని పిలువా రాలేననకే ఓ మనసా! అని. అది విన్న నాకు ఆనందంతో పాటుగా చిన్న హెచ్చరిక కూడా కలిగింది. అనేకానేక కారణాలవల్ల నేను ఈ వేళ ఇలా మీ చెంతకు చేరుకోగలుగు తాను అని అనుకోలేదు. నిజంగా రాలేకపోయి ఉంటే చాల బాధపడి ఉండేవాడిని. ఈ కీర్తన నాకు అక్కడికి వినబడి ఉండేది. రాగలిగి నందుకు ఆనందంగా ఉంది. నేనింతవరకు పత్తివాడపాలానికి రాలేక పోవటమన్నది జరుగలేదు. ఇకపైన కూడా జరుగదు.

"ఈ వాతావరణం నాకు నచ్చింది. ఈ ప్రజలు నాకు నచ్చారు. పిళ్ళు నా వాళ్ళు. వాస్తవానికి పిళ్ళ నేను." అనిపిస్తుంది నాకు. నాయుడు పూర్వంనుండి వస్తున్న మన సంప్రదాయాన్ని కాపాడుతున్నవాడు. మంచి గ్రామపెద్ద. అంటే గ్రామం యొక్క కష్టం తన కష్టంగా, గ్రామం యొక్క సుఖం తన సుఖంగా భావిస్తూ అనుభవిస్తున్నవాడు. ఇలాంటి పెద్దలు గ్రామాలలో ఉన్నంతవరకు గ్రామాలకు ఏ లోటూ ఉండదు. దేశంలో క్రమంగా ఒక మార్పు వస్తూ ఉన్నది. గ్రామాలలో పెద్దలు తగ్గిపోయి, పెత్తందార్లు పుట్టుకొస్తున్నారు. పెద్దలు గ్రామాల కోసం బ్రతికితే, ఈ పెత్తందార్లు గ్రామాలను తమకోసం వాడుకుంటు న్నారు. అలాంటి కలి లక్షణాలు మన ఈ ప్రాంతాలను సోకకుండు

గాక! రామస్మరణ ఉన్నచోట కలి ప్రవేశించలేడు. ఇలా మీ గ్రామాల్లా దేశంలోని అన్ని గ్రామాలూ రూపొందాలి. ఈ మీ గ్రామాలు మిగిలిన దేశానికి మార్గదర్శకం కావాలి.

ఎవరికి చేతనైన పని వారు చేస్తున్నారు. అందరూ అందరికోసం బ్రతుకుతున్నారు చీకటి పడేటప్పటికి రాముని దగ్గరకు చేరుతున్నారు. రాముని భజనలో చేతులు కలుపుతున్నారు ఆ కలిసిన చేతులతో పాటుగా గొంతులు కూడా కలుస్తున్నాయి. ఇన్ని గొంతులు ఒక్క గొంతై "రామ నామం" గానం చేయబడుతున్నది. ఇన్ని మనస్సులు ఒక్క మనస్సై ఆ నామమాధుర్యంలో కరిగిపోవటం జరుగుతున్నది. అప్పుడేమవుతున్నది? గ్రామం రామమయమౌతున్నది. ఉన్నది రాముడొక్కడేనని అనుభవానికి వస్తున్నది! ఇలా మీ భజన సాగుతూనే ఉండాలి. ఆ రాముడు ఇలా ఇక్కడ నిలిచిపోవాలి మన జీవితాలన్నీ రాముని భజనలోని భాగమై పోవాలి. అతడి అడుగు జాడల్లో అతడే ఆదర్శంగా, అతడే మన లక్ష్యంగా అడుగడుగునా అతడినే అనుభవిస్తూ మనం సాగిపోవాలి. అలాంటి భజనకు ఆధ్వర్యం వహిస్తున్న ఈ గ్రామ పెద్దలు ధన్యులు అలాంటి భజనలో మునిగి తేలుతున్న ఈ ప్రజలందరూ ధన్యులు.

రాత్రి ఒంటి గంట దాటుతూ ఉన్నది ప్రవచనమలా సాగుతూ ఉన్నది, రామాయణ ఘట్టాలను కన్నులకు కడుతూ, ఆ సీతారాములను ప్రజల హృదయ పీఠంపై ప్రతిష్ఠ చేస్తూ, నడిచిపోతూ ఉన్నది. దేశా కాలాలకు అతీతమైన స్థితి అప్పటిది. దేశం, కాలం అన్నీ రామమయమే అక్కడ. రాముడు తానుగా సాక్షాత్కరించి, ప్రతిగుండెను తన గుడిగా మలచుకుంటున్న వేళ అది. జీవితాలను ధన్యంచేసే ధర్మ స్పర్శను తానుగా అందిస్తున్న వేళ అది ఆనాటికీ, ఈ నాటికీ, ఏనాటికీ తిరుగులేని తన అభయ ముద్రను పడుతున్న వేళ అది.

ప్రవచనం పూర్తయింది. పారవశ్యం అలా నిలిచిపోయింది. ప్రాంగణమంతా, ఎటు చూస్తే అటు తానై కనబడుతున్నారు మాష్టరుగారు చేరవచ్చిన రోగార్తులకు ప్రేమతో పలుకరిస్తూ, మందులు వ్రాసేస్తున్నారంతలోనే. కొంతసేపలా ఆదృశ్యం నడిచింది.

వేదిక దిగిన మాష్టరుగారు, గ్రామపెద్దలు, ప్రముఖులతో కలిసి, చిన్న చిన్న అడుగులు చకచకా వేస్తూ నాలుగు వీధులూ ఒక్కసారి, కలియ దిరిగారు. ప్రజలెలా అప్పుడే ఇళ్ళకు చేరారో ఏమో, మళ్ళీ వీధి వీధిలో మాష్టరుగారికి నీరాజనాలు. అలా సాగుతూ సాగుతూ అక్కడొక ఇంట్లోకి -అక్కడొక ఇంట్లోకి ప్రవేశించి లోపల కూర్చుంటూ, వారి మురిపాలు తీరుస్తూ ముందుకు సాగుతున్నారు మాష్టరుగారు. మీగడ, వెన్న పాలు, పెరుగు, పంచదార, అటుకులు, బెల్లం, పప్పులు, మిఠాయి, అలా తమకు నచ్చినవన్నీ మాష్టరుగారికి రుచి చూపిస్తున్నారు, ఆ ప్రజలు తాను కొంచెం రుచిచూస్తూ. ఈ దేహాలు, ఈ నోళ్లు, ఈ ఊళ్లు అన్నీ నేనే అన్నాట్లుగా అందరికీ పంచుకుంటూ సాగిపోతున్నారు. మాష్టరుగారు.

ఎప్పైనా రామయ్య ప్రజల మనిషి. ప్రజల కొరకు బ్రతకటం, ప్రజలే తనుగా బ్రతకటం—అది ఆయన లక్షణం. ఆ లక్షణం మరొక్కసారి నిర్వచింపబడుతున్నది ఇక్కడ. ఆ వైభవం మరొకసారి వ్యక్తమై తన్మయత్వాన్ని అనుగ్రహిస్తున్నది ఇక్కడ.

అదిగో ప్రజలు మాష్టరుగారిని కారెక్కిస్తున్నారు. మనసారా ఆయనను స్వీకరించి, తాము మురిసి, ఆయనను మురిపింపజేసి, ఆయన వాళ్ళుగా తాము నిలిచిపోతూ, ఆయనను తిరిగి మనకు అప్పగిస్తున్నారు.

"మళ్ళీ సంవత్సరం ఎంతలోకి తిరిగి వస్తుంది? అయినా నేను మీతో లేని దెప్పుడు!" -అన్నట్లుగా చూస్తున్నారు మాష్టరుగారు వాళ్ళవైపు.

# వేణుగానం

రాత్రి పదిన్నర గంటల వేళ. శ్రీకాకుళంలో ఉత్సవాన్ని పూర్తి చేసుకొని చిన్నకారులో విశాఖవైపుకు ప్రయాణం చేస్తున్నాం, మాష్టరు గారు, నేనూ మరో ముగ్గురు సోదరులూ.

సరస సల్లాపాలతో సాగిపోతున్నది ప్రయాణం. ఆ సల్లాపాలలోనే అనుమానాలు, సందేహాలు నివృత్తి అవుతున్నాయి. సమస్యలకు! పరిష్కారాలు దొరుకుతున్నాయి సందిగ్ధావస్థలు తేల్చివేయబడుతున్నాయి. మాష్టరుగారు అష్టావధానంలా అందరికీ అన్నీ చెబుతున్నారు.

మధ్యలో ఒక చిత్రమైన ప్రస్తావన ఆ ప్రస్తావన. వచ్చేసరికి ఉన్నవారందరూ దానిలోనికి వచ్చారు. ఎవరికి తోచింది వారు చెప్పుకుంటూ వస్తున్నారు. ఇంతకూ ఆ ప్రస్తావన దేనిని గురించి. అన్నది చెప్పాలి కదా కొందరు పెద్దలు మాష్టరుగారి కార్యక్రమాలలో పెద్ద యెత్తున చాలా కాలంగా పాలు పంచుకుంటూ వస్తున్నవారు క్రమంగా ఇప్పుడు మాష్టరు గారికీ, కార్యక్రమాలకు దూరంగా జరిగే ప్రయత్నం చేస్తున్నారు. అలా ఎందుకు జరిగింది? వారలా ఎందుకు దూరమయ్యారు? కావటానికి గల కారణాలేమిటి? ఇలా లోతుగా పరిశీలింపబడుతున్నది ఆ అంశం.

మందస్మిత వదనంతో అందరి అభిప్రాయాలను స్వీకరిస్తున్నారు మాష్టరుగారు. ప్రతి అభిప్రాయంలోనూ ఎంతోకొంత సత్యం ఉండక పోదు కదా అన్నట్లుగా. వారి వారి అభిప్రాయాలను చెప్పడం పూర్తయిన తర్వాత "ఇంతకూ ఇలా ఎందుకు జరిగిందో మీరు చెప్పాలి!" అన్నట్లుగా చూశారు వాళ్ళందరూ మాష్టరుగారి వైపు మాష్టరుగారు నా వైపు చూశారు.

మా చూపుల కలయిక అలా కొద్దిసేపటి పాటు కొనసాగింది.

"మాష్టరుగారూ! నన్ను చెప్పమంటారా!" అని అడిగాను నేను

"ఊఁ! చెప్పు. అన్నారాయన

నేనిక ప్రారంభించాను: మాష్టరుగారి దివ్యత్వాన్ని చూసి, ఆ పెద్దలు మాష్టరుగారికి దగ్గరయ్యారు. మాష్టరుగారి సాహచర్యంలో ఎనలేని అనుభూతినీ వికాసాన్నీ పొందారు వారి మనస్సులూ, ఇంద్రియాలూ, దేహాలూ కూడా కొంతలో కొంత సంస్కరింప బడ్డాయి. వారి నుంచి కూడా కొన్ని మంచి పనులు జరగటం మొదలైంది. వాటి వలన మాష్టరు గారి నుండి వ్యక్తమవుతున్న ప్రణాళిక మరింత విస్తృతిని పొందసాగింది.

అప్పుడు వారు గ్రహించవలసినదేమిటి? అపారమైన ప్రేమతో మాష్టరుగారు మనలను చేరదీశారు. తన వెలుగులో ముంచెత్తుతూ దుర్లభమైన తన సాహచర్యంలో మనని సంస్కరిస్తున్నారు. సంస్కరింప బడుతున్న మనకు తమనుండి వ్యక్తమవుతున్న ప్రణాళికలో పాలు పంచిపెడుతున్నారు ఇంతటి మహత్తరమైన అవకాశాన్నీ, అదృష్టాన్నీ మనకు అనుగ్రహిస్తున్నారు. ఈ అనుగ్రహాన్ని మనం సద్వినియోగం చేసుకోవాలి. అప్పుడు మాష్టరుగారు మనలో తలపెట్టిన సంస్కరణకు మనం కూడా కలిసి వచ్చిన వాళ్ళమౌతాం. సంస్కరణ, త్వరితంగా పూర్తయి, మంచి పనులనుచేసేటందుకు మనం మరింతగా అవకాశాన్ని పొందగలుగుతాం" అని.

అయితే వాళ్ళు చేసిందేమిటి తమ నుండి జరుగుతున్న మంచి పనులు తమసామర్థ్యానికి సంకేతాలనుకున్నారు. "మాష్టరుగారికి మనం అన్ని విధాలా సహకరిస్తున్నాం" అని భ్రమపడి అహంకారాన్ని పెంచు కున్నారు ఇది ఆయన ఇచ్చిన అవకాశమా? మనం చేస్తున్న సహకారమా? అని సూటిగా ప్రశ్నించుకోలేక పోయారు. మన యెడల ప్రేమతో మాష్టరుగారు మనకీ పనిని పంచి పెట్టారు. మన జన్మ ధన్య మయ్యేటందుకు ఒక అవకాశంగా దీనిని మనకు అందించారు." అని

వారు గుర్తించి ప్రవర్తించి నట్లయితే, భాగవత మూర్తులుగా రూపొంది ఉండేవారు అలాకాక, ఎప్పుడైతే, "మనం మాష్టరుగారికి సహకరిస్తున్నాం. మన అండదండలతో మాష్టరుగారు ఇన్ని మంచి పనులు చేయగలుగుతున్నారు. మనమే లేకపోతే ఈయన ఇలా ఇన్ని మంచి పనులు చేయగలరా?" అన్న భావనలు వారిలో మానసికంగా కలిగాయో, వారు ఇక పతనమైపోయారు. అహంకారపడిన వారికి దివ్య ప్రణాళికలో చోటుండదు కనుక వారిక క్రమంగా దూరంగా జరిగిపోయారు. "మనం దూరంగా వెళ్ళిపోతున్నాం ఇక మాష్టరుగారు ఏం చేస్తారో చూద్దాం." అని వారనుకున్నారు కాని మాష్టరుగారి నుండి వ్యక్తమవుతున్న దివ్య ప్రణాళికే, తనకు ఇబ్బంది కలుగకుండా ఉండటం కోసం వారినలా దూరంగా పంపించి వేస్తున్నదని వారు గ్రహించలేక పోయారు.

ఏది ఎలా జరిగినా మాష్టరుగారు మాత్రం అలా ప్రవర్తిస్తున్న వారి యెడల ఇంతకు పూర్వం ఎలా ఉన్నారో ఇప్పుడూ అలాగే ఉన్నారు ఎప్పుడూ అలాగే ఉంటారు. అందుకే ఆయన మాష్టరుగారు. మనను బట్టి మారితే ఆయన "మాష్టర్" ఎలా అవుతారు? తన మనస్సుతో బాటుగా, మన మనస్సు లన్నింటి యొక్క పూర్వాపరాలూ, ఎగుడు దిగుడులూ లోతుపాతులూ అన్నీ పూర్తిగా ఎరిగిన వారు కనుకనే వారు మాష్టరుగారు. ఏ వేళకు ఎవరు ఎలా ప్రవర్తించటానికి అవకాశమున్నదో, అన్నీ తెలిసిన వారాయన. కనుక ఆయనకు ఎవరి ప్రవర్తనలూ ఆశ్చర్యాన్ని కలిగించవు మళ్ళీ ఎప్పటికి ఎవరు ఎలా సర్దుకుంటారో కూడా ఆయనకు తెలుసును. కనుక ఆ సన్నివేశాలు ఆయనకు వ్యథనూ కలిగించవు. జీవితమంటే భయపడని వారికి భూత భవిష్యత్తులు కావలసిన మేరకు గోచరిస్తూనే ఉంటాయని మాష్టరుగారే మనకు చెపుతూ ఉంటారు గదా! మనం నాటకం మధ్యలో వచ్చి, గభాలున ఒక దృశ్యం చూసి, ఏమిటిది? ఇలా జరుగుతోంది! అని కంగారు పడుతున్న వాళ్ళం. ఆ నాటకానికి రచయిత అయిన వానికి ఆ కంగారు ఉండదు కదా!"

సోదరులందరూ అనుభూతి ప్రదమైన అచేతన స్థితిని అనుభవిస్తున్నారు.

మాష్టరుగారు ప్రేమను కురిసే తమ కన్నులతో నాలోనికి చూస్తున్నారు.

"మాష్టరుగారూ! జరుగుతున్నది ఇంతే నంటారా?"- అన్నాన్నేను.

"అక్షరాలా ఇంతే. నడుస్తున్న కథను అక్షర బద్ధంచేసి చెప్పావు నీవు"— అన్నారు మాష్టరుగారు.

"కృష్ణస్వామిగారు చెబుతూ ఉంటే అచ్చం మీరు చెబుతున్నట్లే ఉంటుంది"-అన్నాడొక సోదరుడు.

"అవును. అందువల్లనే నాకు కావలిసినప్పుడు, విశ్రాంతి తీసుకోవటానికీ, కావాలను కున్నప్పుడు మరింత పని చేయటానికి వీలౌతోంది. ఇది నాకు ఒక మంచి ఏర్పాటు. ఒక్కొక్కడు ఒక్కొక్క దాని కోసం పుడతాడు. ఇతను నా కోసం పుట్టాడు. ముఖ్యంగా మీరన్న ఈ పని చేయటం కోసం పుట్టాడు" అంటూ మాష్టరుగారు వారి వైపు తృప్తిగా చూశారు.

"కృష్ణుడి చేతిలో పడితే వెదురుకూడా వేణువు అవుతుంది. ఆపైన ఆవేణువు కృష్ణునికే ఒక భూషణం అవుతుంది. అతడి గానామృతాన్ని ఎక్కడెక్కడి వారికీ పంచి పెట్టే అదృష్టానికి నోచుకుంటుంది. మీచేత స్వీకరింప బడిన నేను అనుభవిస్తున్న అనుభూతి ఇది"-అన్నాను నేను అప్రయత్నంగా.

మాష్టరుగారు నన్ను మరింత దగ్గరగా తీసుకున్నారు.

నాలో తనను తాను చూసుకున్నారు.

# అది సహజం

"ఏమోయ్, ఎలా ఉన్నావ్? రోజులు ఎప్పటిలాగ నడిచిపోతున్నాయా?"

"అంతా మీదయ మాష్టరుగారూ!"

"అంతా అంటే?"

"అంతా అంటే అంతానూ. ఈ మనస్సుకి కష్టమనిపించేవి, సుఖమనిపించేవి అన్నింటినీ కలిపి మీ దయగా భావించటమే కదా కర్తవ్యం. ఇన్నినాళ్ళ సాధనలో మనస్సుకి ఆ విద్య కొంత ఒంటబట్టినట్లున్నది. అది అలా ఒంటబట్టింది అంటే మరి మీదయే కదా కారణం." అంటూ చేతులు జోడించాడతను.

"జనన మరణాలు సహజమే కావచ్చు. అవి అనివార్యమూ కావచ్చు. కాని జీవితంలో ఒకరికొకరు తోడునీడగా వుండే దంపతుల్లో ఒకరు వెళ్ళిపోయి వేరొకరు మిగిలిపోవటం తట్టుకోవటం కష్టమే. అక్కడికీ ఇక్కడ క్లాసులు జరిగినన్నాళ్లూ ఒక కన్ను నేను ఆవిడ మీదనే ఉంచాను. పెద్దగా అర్థం పెట్టుకోకపోయినా, ఇంకొంతకాలం ఇలా బండి లాగుతుంటామనుకున్నాను. క్లాసులు పూర్తయి నేనటు వెళ్ళానో లేదో, ఈవిడ దేహాన్ని చాలించింది మీ దంపతులతో కలిసి గడపటానికి క్లాసులే నాకు చివరి అవకాశంగా మిగిలాయి. పిల్లలు చేతికందొచ్చారనుకో. ఏమొచ్చినా ఆవిడ కాలేరు కదా! వెంకటేశ్వరరావ్, ఇది నీ ప్రయాణంలో ఒక పెద్ద మలుపు.

మాష్టరుగారూ! క్లాసుల నిమిత్తంగా మీరు మాతో రెండునెలలపాటు ఉన్నారు. ఎవ్వరికీ సామాన్యంగా లభించని దుర్లభమైన అవకాశాన్ని, మాకు మీ అనుగ్రహంగా అందించారు. మరణం ఎప్పటికైనా తప్పేది

కాదు. మరణానికి ముందు మీ సాన్నిధ్యాన్ని, మీ సాహచర్యాన్ని అంతగా పొందగలగటం ఆమె అదృష్టం. ఇక ఆ తరువాతి సన్నివేశం అంటారా? ఆమె బ్రతికే అవకాశమే ఉంటే, ఆ సన్నివేశంలో మీరిక్కడే ఉండేవారు. ఆ అవకాశం లేదు కనుకనే మీరిక్కడ భౌతికంగా లేరు. మీ భాష నాకర్థమైంది. ఆ భాషను అర్థం చేసుకుని, మీ స్మరణలో కర్తవ్యాన్ని నిర్వహించాను. ఆమె ఈ ఇంటి దేవత. ఇలవేల్పు. ఈ ఇల్లు ఇప్పుడు ఆవిడ గుడి. ఈ గుడిలో ఆవిడ పూజారిని నేను. శేష జీవితాన్ని మీ స్మరణలో ఇలా గడుపుకుందామనుకుంటున్నాను ఆశీర్వదించండి. ఆశీర్వదించండి."

పాదాలపై వ్రాలిన వెంకటేశ్వరరావును తమ రెండు చేతులతో లేవనెత్తుకుని అక్కున చేర్చుకున్నారు మాష్టరుగారు. కొంతసేపు అలా ఉండిపోయారు. అటుపైన అతనిని అలా ప్రక్కన కూర్చోపెట్టుకొని, అతనివైపు తృప్తిగా చూస్తూ ఇలా అన్నారు "ఈ సేవా కార్యక్రమాలకు మాత్రం, ఏ మాత్రం విఘ్నం కలుగకుండా నిర్వహిస్తున్నావు నీవు. అసలు నీ సంస్థే ఒక సొష్టపు గుడి నీవొక నడుస్తున్న దేవాలయానివి. ఉద్యోగరీత్యా నీవెక్కడికి వెళితే అక్కడ క్రమంగా ఒక బృందం. మాష్టరుగారి సేనగా రూపొందుతారు సేవాయజ్ఞాన్ని ప్రారంభిస్తావు నీవు. అంతా సిద్ధం చేసి, దీపారాధన చేయడానికి రావలసిందిగా నాకు కబురు పెడతావు. నీ కబురు అందింది అంటే ఒక క్రొత్త శాఖ వెలిసింది అన్న మాట. ఆ ఊళ్ళో ఉద్యమానికి కావలసిన పునాదులన్నీ వేస్తావు. ఏర్పాట్లన్నీ చేస్తావు పని చేస్తున్న వాళ్ళకి కావలసినవన్నీ చూస్తావు. ఆ పని చిరకాలం కొనసాగే మార్గం కూడ చూస్తావు. ఇంతలో ట్రాన్స్‌ఫర్ వస్తుంది. ఈ నడిచే దేవాలయం మరొక ఊరు వెళుతుంది మళ్ళీ అక్కడా ఇంతకథ. బాగుందయ్యా! నీ ప్రయాణం."

"అది సరేగాని. ఇవాళ రైలు దిగంగానే మీవాళ్ళు నాకు కావలసిన ఏర్పాట్లు చేయటంలో ఆదే పనిగా పోటీ పడిపోయారు. ఐస చేయటానికి మా ఇల్లు బాగుంటుందిఅంటే మా ఇల్లు బాగుంటుంది అంటారు. మాదగ్గర టిఫినూ, కాఫీలు అంటే, మాదగ్గర భోజనమంటూ. ఒకళ్ళని ఒకళ్లు ఒప్పించే ప్రయత్నం చేస్తారు. ఈ హడావిడంతా ఎందుకయ్యా! నేను మా వెంకటేశ్వరరావు ఇంటికి వెళతాను" అన్నాను. అంటే వాళ్ళేమన్నారో తెలుసా? "ఇప్పుడిప్పుడే అక్కడ కొద్దండీ భోజనాలయిన తరువాత విశ్రాంతి తీసుకుని ఉత్సవవేదికకు ప్రయాణమైనప్పుడు అక్కడికి వెళదాము" అన్నారు ఇకఅంతే. వాళ్ళు చెప్పినట్లల్లా చేయటం నావంతు అయింది. నువ్వేమో నన్ను వాళ్ళకు అప్పగించి ఇక్కడనుండి పోయావు.

"మీకు తెలియంది ఏముంది మాష్టరుగారూ! ఇక్కడి పిల్లలలా ప్రవర్తించటం సహజం. కదా! వాళ్ళకు వయస్సు ఉండొచ్చు. హోదా లుండవచ్చు. నా దృష్టిలో ఈ కథలో వాళ్లు పిల్లలే. చంటిపిల్లలు తల్లి దండ్రులని ఏమని అడుగుతారు? మమ్మల్ని వదిలిపెట్టవద్దు మాతోనే ఉండండి" అంటారు. దూరంగా ఎదపిల్లలు కనబడుతుంటారు. మరి వాళ్ళ సంగతేమిటీ అంటారు తల్లిదండ్రులు. ఊహూ. ఏమైనా సరే. మా తర్వాతే వాళ్ళంతా. మీరు మాతోనే ఉండాలి!" అంటారు ఆ చంటి పిల్లలు. అప్పుడా తల్లిదండ్రులేమంటారు? చంటిపిల్లల్ని దుఃఖపెడతారా? వాళ్లు మేలుకున్నంతసేపు వాళ్ళతోనే వుండి, వాళ్ళకు కావలసినట్లే ఉండి, వాళ్ళని నిద్రపుచ్చి, లేదా మరిపించి, ఎదపిల్లల దగ్గరకొస్తారు. ఇప్పుడు మీరు చేసింది సరిగా అదే కదా!

అదిగాక, ఇంకా కొద్దినెలల్లో, నేనిక్కడినుండి బదిలీ కాబో తున్నాను. మరిక్కడి కార్యక్రమాలను కొనసాగించవలసింది వాళ్ళే కదా! మీనుండి వాళ్ళు పొందిన అనుభూతే ఆ కొనసాగించటానికి పెట్టు

బడి అక్కడుంది కదా! అందుకని వాళ్ళు ఎంతగా అనుభూతి చెందితే అంత మంచిది. వాళ్ళు మీకు ఎంతగా దగ్గరయితే అంత మంచిది." అన్న ఉద్దేశంతో ఈ హారి నుండి మిమ్మల్ని వాళ్ళకే వదిలేయాలనుకున్నాను. నాకలా అనిపించింది

మాష్టరుగారి కన్నులు ప్రేమను తృప్తి రూపంలో వర్షిస్తున్నాయి. "వెంకటేశ్వరరావ్! నిక్ష ధన్యజీవివయ్యా!" అని, ఆ చూపులతోనే చెప్తున్నారు మాష్టరుగారు అనిపించింది.

తండ్రిని అలా మాష్టరుగారి సన్నిధిలో చూస్తూ, అల్లంతదూరాన చూసి పులకించిపోతున్నారు ఆయన బిడ్డలు.

ఆ వెనుకనుండి ఆ ఇంటి ఇల్లాలు ఛాయాచిత్ర రూపంలో నిలబడి తృప్తిగా నవ్వుకుంటోంది. అవి కృతజ్ఞతా పూర్వకమైన నవ్వులు. "మీ సాహచర్యంలో మా దంపతుల జీవితం నిండుగా వెలిగింది. తృప్తిగా సాగింది. ఎన్నాళ్ళు బ్రతికాం! అన్నది కాదు ముఖ్యం "బ్రతికినన్నాళ్ళు ఏలా బ్రతికాం?" అన్నది ముఖ్యం. "మాష్టరుగారూ! ఇదే కదూ! మీరు మాకు నేర్పిన పాఠం. ఇదే కదూ! మీ జీవిత సందేశం" అని అడుగుతున్నట్లుగా ఉన్నాయా నవ్వులు.

మాష్టరుగారు నవ్వుతున్న ఆమెవైపు చూశారు. వెంకటేశ్వరరావు కూడా అటువైపుకే దృష్టిని సారించాడు. ఆ చూపుల నందుకుని అక్కడున్న పిల్లలు కూడా అటువైపుకే చూశారు.

అలా తనవైపుకే చూస్తున్న అందర్నీ చూసుకుంటూ మరింత తృప్తిగా నవ్వుకుంటున్న పెదవులతో గోచరించింది, ఆ ఇలవేల్పు ఆ చిత్రంలో నుండి.

# అందరూ బాగుండాలి

మేళ తాళాలు మ్రోగు తున్నాయి.

పెళ్ళి సందడి మరీ సందడిగా ఉంది.

ఆంధ్రా యూనివర్శిటీ వెంకటేశ్వరా ప్రేయరు హాలు కుటుంబా లతో తరలి వచ్చిన అధ్యాపక వర్గంతో కళకళ లాడుతోంది.

ఆ జరుగుతున్నది రమేష్ దత్తాగారి అమ్మాయి వివాహం. అందుకే అంత హడావిడి. ఆయన ఎందరికో ఆత్మీయుడు. మరెందరికో స్నేహితుడు. ముఖ్యంగా మాష్టరుగారి అంతేవాసులలో ఒకడు. ఈ వివాహానికి సంబంధించిన కథ అంతా మాష్టరుగారి చేతుల మీదుగా నడి చిందే. అందుకే దత్తాదంపతుల కళ్లు ఎందరు అక్కడ చేరినా, అందరిలో నుండి ఆయన కోసం వెతుక్కుంటున్నాయి.

తెల్లటి బట్టలతో పుష్పంలా మెరుస్తూ, చిరునవ్వులతో వెలుగులను వెదజల్లుతూ, ప్రాంగణంలోనికి ప్రవేశించారు మాష్టరుగారు.

ముహూర్తం సమీపించ బోతూ ఉన్నది. అక్కడకు చేరి ఉన్న అందరి అభినందనలు అందుకుంటూ, ఒక్క ఉదుటన వేదికను ఆరోహిం చారు మాష్టరుగారు. దగ్గరగా నిలబడి ముహూర్తాన్ని జరిపించి మొదటగా ఆశీర్వదించారు. "అందరూ నావారే. అందరూ బాగుండాలి." అన్నట్లుగా ప్రాంగణంలోని అందరినీ, ఒక్కసారిగా కలయజూచారాయన. ఆ చూపులు సోకినంత మేర ఇది, అది అని చెప్పలేని అనుభూతి ఏదో నిండి పోతున్నది. ఆ ప్రాంగణం ఆయన చూపులతో పొదగబడు తున్నది.

వేదికపై నుండి దిగుతున్న మాష్టరుగారి పాదాలకు నమస్కరించి, ఆయనను చేతులతో అందుకున్నారు యస్-యస్సార్. కృష్ణశాస్త్రిగారు. సూత్రధారణకు ఇంకా కొంత సమయ మున్నది. చేరిన వారందరూ కొంత విరామాన్ని అనుభవిస్తున్నారు. మాష్టరుగారూ, కృష్ణశాస్త్రిగారూ అలా కొంత ప్రక్కగా, ఆ ప్రక్కగా ఉన్న చెట్లకు దగ్గరగా చేరారు. మరి కొంత మంది కూడా వారిని చేరుకున్నారు. పంచదార దగ్గరకు ఛీమలు చేరినట్లు ఆయన ఎక్కడ ఉంటే అక్కడే జనం. అలా నలుగురూ చేరినప్పుడు గ్రహగోళాల చేత పరివేష్టింపబడి ఉండే ఆదిత్యునిలా గోచరిస్తా రాయన.

మాటల మధ్యలో ఒక ఆత్మీయుని గూర్చిన ప్రసక్తి వచ్చింది. కృష్ణశాస్త్రిగారే ఆ ప్రసక్తి తెచ్చింది. "అతని ఆలోచనా విధానంలో ఎక్కడో చెప్పలేని ఒక వెలితి కనబడుతోంది. అది ఏమిటంటారు?" అని అడిగారాయన.

మాష్టరుగారు ఇలా అన్నారు: రచనలో సూటిదనమున్నది. చెప్పడంలో స్పష్టత ఉన్నది. ఆలోచనా విధానంలో మరి కొంత సమన్వయం అతడిలో రావలసి యున్నది. నేనీ విషయం అతనితోనే చెప్పాను. చెప్పినప్పుడు ఒప్పుగా విన్నాడు. విన్నది నచ్చటానికీ, నచ్చింది దర్శనం ఇవ్వటానికీ, దర్శన మిచ్చింది అతని జీవిత విధానంగా రూపొందటానికి కొంత సమయం పడుతుంది. ఇక్కడ కొంత సమయం అంటే, ఒక్కొక్కప్పుడు కొన్ని జన్మలు పట్టవచ్చు. జనన, మరణాలు. జన్మల పరంపరలూ మన దృష్టిలో పెద్ద విశేషాలు కావచ్చు. కాని కాలాని కవి అసలు విశేషాలే కావు. సహజమైన అంశాలు.

ఇంతకూ నేనతనికి చెప్పింది ఏమిటి? అంటే, "అబ్బాయీ: నీవు నాస్తికులను ద్వేషిస్తున్నావు అదే మంత మంచిపని కాదు. ఎందుకనంటే ఈ సృష్టిలో ఎవరి పరిణామం వారిది. పరిణామంలో ఎవరు ఎక్కడ ఉన్నారో, దానిని బట్టి వారి అభిరుచులూ, విశ్వాసాలూ ఉంటాయి. గొంగళి పురుగుల వల్ల తాత్కాలికంగా ఇబ్బంది ఉన్న మాట నిజమే. ఇబ్బంది ఉన్నది కదా అని వాటి నన్నింటినీ చంపేస్తే, సీతాకోక చిలుకలు ఎక్కడినుండి వస్తాయ్? వాటిని చంపకూడదు. అసహ్యించుకో కూడదు. అలాగని వాటి జారిన పడకూడదు వాటి మానాన వాటిని బ్రతుకనిస్తే, కాల క్రమాన అవే సీతాకోక చిలుకలై, మన కనులకు, విందు చేస్తాయి.

ఈ సృష్టి మన ఒక్కరిదే కాదు. ఈ సృష్టిలో ఉన్న వారందరిదీ. అందులో కొన్ని తెగలు మనకు నచ్చక పోవచ్చు. కొన్ని తెగలు మనని మెచ్చక పోవచ్చు. అంత మాత్రాన వారు నశించాలి అని మనకు అని పించ కూడదు. నశించాలి అని చెప్పి ఎవరు, ఎవరిని గూర్చి నినాదం చేసినా, అది తప్పే అవుతుంది గాని, ఒప్పుకాదు. నశించాలి అని అన కూడదు. "అందరూ వసించాలి, అందరూ వర్ధిల్లాలి." అనాలి. మనలో ఒకరి సిద్ధాంతం మరొకరికి నచ్చకపోవచ్చు. కానీ ఈ సృష్టిలో అన్ని సిద్ధాంతాలకూ అవకాశం ఉన్నది. అన్ని సిద్ధాంతాలకూ ప్రాతినిధ్యం ఈ సృష్టిలో ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. నాస్తికత్వం, ఆస్తికత్వం ఈ సృష్టికి క్రొత్తకావు. మొదటినుండీ ఒకదాని ప్రక్కన ఒకటి వస్తూ ఉన్నవే.

మహా భారతం చదివావా? మహాభారతం ఏ ఘట్టంతో ప్రారంభ మవుతుంది? సర్పయాగాన్ని ఆపించడంతో ప్రారంభమవుతుంది. "సర్పాల వల్ల మాకు ద్రోహం జరిగింది. కనుక సర్పకులం సమూలంగా నాశనమై పోవాలి." అని ప్రారంభిస్తారు సర్పయాగాన్ని. కాని ఆ కోరిక నెరవేరలేదు. సర్పయాగం పూర్తి కాలేదు. సర్ప కులం పూర్తిగా నశించి పోలేదు. ఆస్తీకుడు వచ్చి కలుగజేసుకుని, జనమేజయుడికి నచ్చ జెప్పి, సర్పయాగాన్ని ఆపించేశాడు. దీని అర్ధమేమిటి? ఈ సృష్టిలో ఏజాతిగాని, ఏ ఆలోచనా విధానం గాని పూర్తిగా నశించి పోవటమనేది జరగదు. జరుగ కూడదు అందరూ ఉండాలి. అన్ని విధాలుగా ఆలో చించే వాళ్ళూ ఉండాలి. ఎవరిని ఎవరూ ఇబ్బంది పెట్టుకోకుండా, ఎవరిని ఎవరూ కించ పరచుకోకుండా, అందరూ ముందుకు సాగాలి. ఒకరి నొకరు చిన్న చూపు చూడ కూడదు. ఒకరినొకరు తక్కువగా అంచనా వేయకూడదు. ఎవరున్న స్థితిని బట్టి వాళ్ళు ఆలోచిస్తారు. అది తెలిసి మనం వాళ్ళను ప్రేమించాలి గౌరవించాలి. ప్రోత్సహించాలి. చేతనయితే పరిణామంలో వారిని ముందుకు నడిపించాలి. అప్పుడు ఆపైన ఏం కన బడుతోందో వారే చెపుతారు. మన మెందుకు తొందర పడటం? మన మెందుకు తెగనాడటం? మన మెందుకు వారిని తూలనాడటం? ఈ తెగ నాడటాలూ, తూలనాడటాలూ దేనిని తెలియ జేస్తున్నాయి? మనలో ప్రేమలేని తనాన్ని తెలియ జేస్తున్నాయి. మిరన్నారే ఇందాక. ఏదో వెలితి కనిపిస్తూ ఉంటుందని. అది ఇదే. ఈ ప్రేమ రాహిత్యమే! ఈ అంశాన్నే అతనికి నొక్కి చెప్పాను.

ఇంకొక మాట కూడ చెప్పాను: సత్యానికి చాలా దూరంగా ఉన్నారని, ఆ నాస్తికులనబడే వారిని గురించి నీవు అంతగా చింతిస్తున్నావే? వారిని రెచ్చగొడుతూ, పందెం కాస్తూ, రచనలు చేస్తున్నావే. దానికన్నా సత్యాన్ని తెలుసుకో దలచిన వాళ్ళు ఎందరో ఉన్నారు. వారికి, సత్యాన్ని గూర్చి మృదు మధురంగా తెలియ జెప్పటంలో నీ రచనా శక్తిని సద్వినియోగం చేయవచ్చు కదా। ఉన్ముఖులు కాని వారిని చూసి గద్దించే కన్నా, ఉన్ముఖులై నిలబడుతున్న వారి యెడల బాధ్యత పడి నిలబడ వచ్చుకదా। ఈ మాటలతనికి కొంత నచ్చినట్లున్నాయి.

మరొక మాట కూడ చెప్పాను. దైవాన్ని గూర్చి ప్రస్తావన లేకుండా జీవించేస్తున్న వారి కన్నా, దైవాన్ని గూర్చి ప్రస్తావన తెస్తూ, అతడు లేడూ అతడు లేడూ అని ఒకటికి పదిసార్లు అంటున్న వాళ్ళు పరిణామంలో కొంత ముందుకు వచ్చినట్లే కదా। లేడు, లేడు అనటంతో వారు తమ ప్రయాణాన్ని ప్రారంభిస్తున్నారు. చాల తీవ్రంగా ప్రారంభిస్తున్నారు. ప్రారంభించనివ్వండి. ఆ ప్రయాణం కొనసాగాలని కోరండి. కొనసాగి చేరవలసిన చోటుకు చేరితే ఉన్నాడు, ఉన్నాడు అని వాళ్ళు మన కన్నా పెద్ద గొంతులతో చాటుతారు శుభమా। అని వాళ్ళు ప్రయాణాన్ని ప్రారంభిస్తుంటే మనం పనిగట్టుకొని తుమ్మటం ఏమైనా బాగున్నదా? దేవుని యొక్క ప్రస్తావనలేకుండా జీవించే వారికన్నా, దేవుని ఫొటోలు పెట్టుకొని, వాడికేదో రొటీన్‌గా ఇంత చేయి చూపించి, తమ మానాన తమకు తోచినట్లు బతికేస్తున్న వారికన్నా, లేదా, తమకున్న చిన్న. పెద్దా బాధ్యతలన్నీ తాము పూజించే దేవుడి నెత్తిన వేసి, మాదేమున్నది? మేల

నిమిత్త మాత్రులం. అని నామరి పోటులుగా రూపొందుతున్న వారికన్నా, జీవితంలో ఇంత కష్టం రాగానే, మంత్రాన్ని, గురువునీ, ఇంకా చెప్పాలంటే తనమతాన్ని మార్చేసుకుంటున్న, వారికన్నా ఈ లేడు, లేడుఅంటూ, అతడికోరకు నిజంగా వెతుతుకున్న వాళ్ళని మనం తక్కువచేసి మాట్లాడవచ్చునా? ఇది ఆలోచించ వలసిన అంశం కాదా" అని అన్నప్పుడు అతడు మరికొంత ఆలోచనలో పడినట్లు కనిపించాడు.

అప్పుడిలా చెప్పాను: తమ్ముడూ! సమాజం అన్న తర్వాత అన్ని స్థాయిల్లో ఉన్నవాళ్లూ ఉంటారు. ప్రేమతో, వారి స్థాయికి తగినట్లుగా, వారికి తగిన దోహదాన్ని అందించటమే మన కర్తవ్యం. అనాదిగా దేవుడి పేరిట పెద్దలందరూ చేస్తూ వస్తున్న పని అదే. ఉన్నస్థితి నుండి, ఉండవలసిన స్థితికే మానవజాతిని నడిపించటమే. ఆ నడిపించటానికి మన తెలివి తేటల కన్నా, మన విమర్శనా జ్ఞానం కన్నా, మన వాదనా పటిమ కన్నా, మనలోని ప్రేమ అందుకు పనికి వచ్చేది. ప్రేమ ముందు నడవాలి. ఆ ప్రేమకు ఒదిగి, మనలోని శక్తియుక్తులన్ని మెలగాలి. అప్పుడు అందరినీ అక్కున చేర్చుకోవటం చేతనవుతుంది. అందరినీ అర్థం చేసుకోవటమూ చేతనవుతుంది. అందరి ఎదుగుదలకూ దోహదం చేయుటమూ చేతనవుతుంది" శాస్త్రి! ఇది నేను చెప్పిన చివరి మాట. ఇప్పటికి మీకు చెప్పే చివరి మాట కూడా ఇదే.

"అదిగో! సూత్రధారణ జరుగబోతున్నది ఈ అక్షింతలు అక్కడలేసి, ఈ సూత్రధార్ ఇక సెలవు తీసుకుంటాడు, మోతు గూడెం ప్రయాణానికి, సిద్ధమైన సరంజామా అంతా అక్కడికే చేరుతోంది. నేను నా చిన్న సరంజామా మాత్రం మిగిలి ఉన్నాం. ఇక వెళ్ళిరానా? మరి.

ఈ కల్యాణ వేదిక మీ ప్రవేశంతో లోక కల్యాణవేదికగా రూపొందింది. ఆత్మీయుని ప్రస్తావన వచ్చిన పుణ్యానికి విశ్వ కల్యాణ సాధన ఎలా గన్నది? మా కన్నులు తెరిపించి చూపించారు. ఈమా సామాన్య జీవితాల్లో మీరు ప్రవేశించినపుడల్లా ఒక విశేషం కనబడుతుంది. ఒక వివేకం వెలుగుతుంది. ఒక గమ్యం గోచరిస్తుంది. ఒక ప్రయాణం ప్రారంభమవుతుంది గురూజీ! ఇవే మా నమస్కృతులు అందుకోండి. మళ్ళీ మనం ఎప్పుడు కలుసుకుంటామో?

అదేంటా మాట? మన కలయికకు కొనసాగడమే గాని, ఎడబాటు ఉండదు. కలయిక అనేది మానసికమైనది ఇంకా చెప్పాలి అంటే ఆత్మ పరమైనది. ఆ కలయికకు శ్రీకారం చుట్టటానికి, అప్పుడప్పుడూ కావలసిన దోహదాన్ని తగుమాత్రంగా అందించటానికి ఈ దేహాలు నిమిత్త మాత్రంగా అవసరమవుతూ ఉంటాయి. నిజానికి ఈ మన ప్రయాణం ఎప్పటి నుండి సాగుతూ ఉన్నదో? ఆ సాగుతున్న ప్రయాణంలో మధ్యలోని విశేషాలి వన్నీ. అందరూ ఉండండి. అందరికీ శుభం అవుతుంది. ఇక నాకు అనుమతి ఇప్పించండి.

మాష్టరుగారు సూత్రధారణ అనంతరం నూతన దంపతులను మరొక్కసారి ఆశీర్వదించి, ఆ వేదికపై నుంచి నిత్య నూతనమైన తన చిరునవ్వులను వెదజల్లుతూ, ప్రాంగణాన్ని మొత్తంగా మరొక్కసారి కలియ జూశారు.

కొద్ది క్షణాల్లో చిన్నచిన్న అడుగులను చకచకా వేస్తూ అలా అందరిలో నుండి, ఎవరికీ అందకుండానే ముందుకు సాగుతున్నారు. కర్తవ్యోన్ముఖులై ముందుకు సాగుతున్నారు.



# పల్లె 'పట్టు' – పారవశ్యం

శ్రీకాకుళంలో హోమియో వైద్య శిక్షణ తరగతులు మాష్టరుగారు స్వయంగా నిర్వహిస్తున్న సమయమది. వైద్యశిక్షణతో పాటుగా, వేద శిక్షణ, లలితా సహస్ర రహస్యవివరణ, యక్ష, నహుష ప్రశ్నలకు వివరణ మొదలైన అంశాలు కూడా ఆ శిక్షణ కార్యక్రమంలో చోటు చేసుకున్నాయి ఇక వైద్యసేవ సరేసరి, నదులన్నీవచ్చి సముద్రంలో కలిసి నట్లుగా, పల్లెపట్టుల ప్రజలందరూ వచ్చి, శ్రీకాకుళం చేరుతూ ఉన్నారు మాష్టరుగారిని దర్శించి, దారుణ, మారిణ రోగస్థితులకు పరిష్కారాన్ని పొందుతున్నారు. వీటి అన్నింటితో బాటుగా, ఆ పల్లె ప్రాంతాలలోని ప్రజలు మాష్టరుగారి సందేశామృతాన్ని కూడా అందుకోగలిగితే ఈ నడుస్తున్న శిక్షణ కార్యక్రమానికి మరింత నిండుదనం చేకూరుతుందని కార్యకర్తలలో ప్రధానులైన వారికి అనిపించింది

కార్యకర్తలలో ప్రధానుడైన కానుకుర్తి సుదర్శనరావు కార్యక్రమానికి రూపకల్పన చెయటం ప్రారంభించారు. ఆ పల్లె ప్రాంతాలలో వారికి పొలాలున్నాయి అనేక ప్రాంతాలలోని రైతులతో, వారి కుటుంబానికి ఆత్మీయమైన సంబంధాలున్నాయి. వీటి నన్నింటినీ పురస్కరించుకొని, శ్రీకాకుళానికి కొంతదూరంలో నున్న "చెవ్వామ్" అనే గ్రామంలో, ఒక ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటు చేశారు. ఆ కార్యక్రమం ఖరారు కాగానే మాష్టరుగారు వెంటనే ఆ కబురు విశాఖలోని నాకు తెలియ పంపారు. ఎక్కడ ఏ క్రొత్త కార్యక్రమానికి శ్రీకారం చుడుతున్నా నన్ను చెంతకు పిలిపించుకోవటం ఆయనకు పరిపాటే. "కృష్ణస్వామి ప్రక్కనుంటే బాగుంటుంది. అందులోనూ గ్రామసీమ లంటున్నారు. అతడు వచ్చేటట్లుగా చూద్దాం." అన్నారుట ఆయన కార్యకర్తలతో.

ఆ రోజు రానే వచ్చింది. దూసి మీదుగా మా ప్రయాణంసాగింది. "చెల్మామ్" గ్రామాని చేరుకున్నాం. ఒక పెద్ద మండువా లోగిలి, నారాయణ యజ్ఞానికి వేదికగా వెలిసింది సిండుగా జరిగింది కార్య క్రమం. ఆ పైన వైద్యసేవ.

సాయంత్రం సభా కార్యక్రమం ఆ ప్రాంతపు హెడ్‌మాష్టరు గారి అధ్యక్షతన ప్రారంభమైంది. ఆయన పులకించిపోతూ మాట్లాడారు, "జగద్విఖ్యాతులైన మాష్టరుగారు, ఇలా గ్రామాలకు తరలిరావటం, ఆ సభకు తాను అధ్యక్షత వహించటం, తమ అదృష్టమంటూ పులకించి పోయారు. నన్ను సభకు పరిచయం చేశారు. ముందు నన్ను మాట్లాడ మన్నారు. నేను మా స్వగ్రామమైన దివికోడూరు గ్రామాన్ని కథా వస్తువుగా ఎంచుకున్నాను "హత్యలకు పేరుబడ్డ మా గ్రామం, మాష్టరు గారి పాదస్పర్శతో మానవసేవ వైపుకు ఎలా మళ్ళిందో", కథగా వివరించి చెప్పాను వారికి. అలా మీరూ చేయండి. మీ ప్రాంతాలను మీరూ పున ర్నిర్మించుకోండి." అన్న ప్రబోధాన్ని అందచేస్తూ, మాష్టరుగారికి మైకు నందించాను.

లేచిన మాష్టరుగారు భారతమాతతో తాదాత్మ్యం చెంది మాట్లాడ సాగారు. భారతీయుల అలసత్వాన్ని ఆటపట్టించారు. ఆత్మవిశ్వాసంలేని లేనితనాన్ని ఎత్తిచూపారు. బాధ్యతారహిత ప్రవర్తనను గూర్చి తెలియ చెపుతూ మండలించారు. అన్నింటికీ మించి, జాతీయభావం లోపించటమనే దారుణస్థితిని తెలియచెపుతూ, ఉద్వేగాన్ని పొందారాయన. ఇవాళ ఇండియా ఎక్కడ ఉన్నది' ఇండియాలో వున్న వారందరూ తలొక దేశానికి మానసపుత్రులయ్యే ప్రయత్నం చేస్తున్నప్పుడు ఇంకా ఇవాళ ఇండియా ఎక్కడ ఉన్నది' ఇటు అమెరికాకో, అటు రష్యాకో, లేక చైనాకో మానసపుత్రులుగా జీవించటానికి ముచ్చట పడుతున్న ఇవాళటి

ఇండియాలో ఈ దేశానికి పుత్రులుగా బ్రతుకుతున్నవాళ్ళు ఇవాళ ఎంద రున్నారు? మీరిలా బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తూ వుంటే, ఒక రష్యా వాడో, ఒక అమెరికా వాడో, ఒక చైనా వాడో, మీకు మంత్రం పెట్టి మిమ్మల్ని మసిపూసి మారేడుకాయలు చేసేస్తుంటే ఇలా ఎలా ఉండిపో గలుగుతున్నారు మీరు? మీచుట్టూ ఏం జరుగుతున్నదో మీకు తెలుసునా? మీ జుట్టు ఎవరి చేతులలోనికి వెళ్ళిపోతున్నదో, మీకు తెలుసునా?"

ఇంతలో సభలో కలకలం. సభలో ఒక మూల నుండి ఒక ఇద్దరు ముగ్గురు లేచి నిలబడ్డారు. ఇందాకటి నుండి చూస్తున్నాం. మీరదే పనిగా మమ్మల్ని తిట్టిపోస్తున్నారు అసలు మీరెందుకు వచ్చారు? మమ్మల్ని తిట్టటానికా? వచ్చినవాళ్ళు మీ సంగతేమిటో చెప్పి మీరు వెళ్ళిపోవచ్చుగా. మీకు ఇవన్నీ ఎందుకు? మీ తత్త్వమేదో మీరు చెప్పుకోండి. మీకీ రాజ కీయాలెందుకు? ఈ మా సంగతులన్నీ మీకెందుకు?

అని వాళ్లు అంటుండగానే అక్కడ కొందరు, అక్కడ కొందరు, అక్కడ కొందరు లేచి నిలుచున్నారు. నిలుచున్న వారందరూ ఆమొదట లేచిన వారితో శ్రుతి కలుపుతున్నారు. అందరూ కలసి ఆవేశంతో ఊగి పోతున్నారు. క్రమంగా ఆ సభంతా దావానలంలా వ్యాపిస్తున్నది ఆవేశం. సభ ఊగుతున్నది. వేదికపై పడిపోదామా? అన్నంతగా ఊగుతున్నది.

మాష్టరుగారు అలాగే నిలబడి, ఆవేశపూరితులవుతున్న గ్రామ ప్రజలవంక చూస్తున్నారు. ఇంతలో సోదరుడు యమ్. ఆర్. యల్. రావ్. నాకు దగ్గరగా వచ్చి, నాకు మాత్రమే వినబడేటట్లుగా ఇలా అన్నాడు "కృష్ణస్వామీ, సన్నివేశం చెయ్యి దాటేటట్లుగా వుంది. కొందరు కావాలని సన్నివేశాన్ని వక్రమార్గం పట్టిస్తున్నారు. ప్రజలను రెచ్చగొడుతున్నారు. నువ్వేలే! లేచి, సన్నివేశాన్ని దారిలోనికి తీసు కొనిరా!" అన్నాడు.

నేనులేచాను లేస్తూనే, "మాష్టరుగారూ! మీరు కూర్చోండి! అంటూ మాష్టరుగారిని కూర్చోపెట్టాను. ఇక మైకు నందుకున్నాను. సోదరులారా! నేను చెపుతున్నాను. ఎక్కడివాళ్ళక్కడ కూర్చోండి. ఊఁ కూర్చోవాలి. ఎక్కడివాళ్ళక్కడ కూర్చోవాలి. కూర్చున్నారు కదా! ఇక నేను చెప్తున్నాను వినండి. ఏమన్నారు. మీలో కొందరు ఏమిటి మమ్మల్ని ఇలా తిడుతున్నారు! అన్నారు కదూ. మాష్టరుగారి మందలింపులు మీకు తిట్లులా వినబడ్డాయి కదూ! అప్పుడు వినబడతాయి. నేను మిమ్మల్ని అర్థం చేసుకోగలను. మీకలాగే వినబడతాయి. ఎందుకో తెలుసునా! మందలింపబడటం అనేది మీరుమరచిపోయి చాల కాలమైంది కనుక. మీతో పనుండి వచ్చిన వాడు మిమ్మల్ని పొగడుతున్నాడు. మీతో పని ఇంకా రానివాడు రేపెప్పుడైనా పని రావచ్చు కదా!" అని మీతో మంచిగా ఉంటున్నాడు. మిమ్మల్ని పాలించే నాయకులు మీ ఓట్లు ఎక్కడ పడవోనని, మీతో జాగ్రత్తగా వుంటున్నారు. దేవుడి పేరిట బోధ చేయటానికి వచ్చే స్వాములు మీ నుండి ముడుపులు ఆశిస్తున్నారు కనుక, మిమ్మల్ని ఆశీర్వదించి వెళ్ళిపోతున్నారు ఇలా, గత కొన్ని దశాబ్దాలుగా మిమ్మల్ని అందరూ పొగిడేవారే. మీతో అంతా మంచిగా ఉండేవారే తమతమ పనుల్ని మీతో చేయించుకుని వెళ్ళిపోయేవారే. అవునా! నేను చెప్పింది నిజమేనా? అవును కదా! అందుకే కదూ! మాష్టారు గారి మందలింపులు మీకు తిట్లులా వినబడ్డాయి. మీ నుండి ఏదైనా ఆశించేవాడు మిమ్మల్ని శాసించగలడా? మీ నుండి ప్రయోజనాన్ని నిరంతరం కోరే వాడు మిమ్మల్ని మందలించగలడా? మరి, మిమ్మల్ని మందలించే దెవ్వరు? మీకు మంచి చెప్పేదెవ్వరు? మిమ్మల్ని సరిచేసేదెవ్వరు? మిమ్మల్ని సంస్కరించే దెవ్వరు? మీరు ఎవరికి కావాలి? మీరేమయిపోతే ఎవరికి కావాలి? ఆలోచించండి. ఎప్పుడైనా ఆలోచించారా? మనల్ని నిజంగా పట్టించుకునే వాడెవడని మీరు ఎప్పుడైనా ఆలోచించారా? నిజం చెప్పండి.

చూడండి! అలా మానవజాతిని పసికట్టుకొని, మందలించి, సంస్కరించి,తీర్చిదిద్దేటందుకు దైవం కాలకాలాల్లో దిగివస్తూ ఉంటాడు. ఆ సంగతి మీకు తెలిసిందేగా! "సంభవామి యుగే యుగే" అని మీరు అంటున్నారేగా! ఏం మాట్లాడరేం? మరి, మీరు చెప్పినట్లుగా ఆ దిగివచ్చేవాడు ఎలా ఉంటాడో, మీరు ఒక్కసారి ఊహించండి. అతడు మనకు నచ్చేవి చెపుతాడా? మనకు కావలసినవి చెబుతాడా? మనకు హాయిగా ఉండేవి చెపుతాడా, మనం చేయవలసినవి చెబుతాడా? మనని జోకొడుతాడా, మనని మేల్కొలుపుతాడా? మనలో తానుకూర్చుండి పోతాడా! తనతో మనని కూడ నడిపిస్తాడా? చూడండి! ఇప్పుడు చూస్తున్నది, మీరు ఆ రూపాన్నే. వివిధ మానవజాతుల సంస్కృతీ నాగరకతలను మేళనం చేస్తూ ప్రాక్ పశ్చిమాలకు సాంస్కృతిక వారధిని నిర్మాణం చేస్తూ బాధ్యతా రహితమైన స్ప్రదాణ స్థితినుండి, భారతజాతిని మేల్కొల్పుతున్న వాడెవడో, అతడినే మీరిక్కడ చూస్తున్నది. ఎవడి ఇంటి ముందు వేలాది ప్రజలు తిరునాళ్లగా బారులు తీర్చి నిల్చుంటారో, ఎవనికి రోజుకు ఇరవై రెండు గంటలు పనిచేసినా, ఇంకా చేయవలసిన పని అలా మిగిలిపోతూనే ఉంటుందో, ఎవని దర్శనం కోసం దేశదేశాల ప్రజలు అలా ఎదురు తెన్నులు చూస్తుంటారో, అతడు నా వాడని, నావాడని, నా కర్తవ్యమనీ, ఆపేక్షతో, అదవంత, బాధ్యతతో మీ చెంతకుతానుగా నడచి వచ్చి, తన ఓంకారవంతో మీకు మేల్కొల్పనను గ్రహిస్తూ ఉంటే, మీరిలా ప్రవర్తించడం న్యాయమేనంటారా! ఈ మహా పురుషునికి మన మిచ్చుకునే కానుక ఇదేనంటారా? ఆలోచించండి. ఆలోచించండి.

మురికిగా తయారైన బిడ్డను పట్టుకొని, తల్లి బలవంతాన గుడ్డలు ఊడదీసి! ఒంటని అంటిపెట్టితోమి, నీళ్ళు పోస్తుంది. అప్పుడు ఆ బిడ్డ ఓ అమ్మో, ఓ నాయనో మా అమ్మ నాచేతులు విరిచేస్తుంది అంటే ఎలా

ఉంటుంది? సరిగా ఈ సన్నివేశంలా ఉంటుంది ఇంతకీ ఆ స్నానం చేయించటం ఎవరికోసం అంటారు? ఆ తల్లి తపనంతా ఎవరికోస మంటారు? ఆలోచించండి. లోతుగా ఆలోచించండి."

ఈ మహాపురుషుడు మాట్లాడిన మాటల్లో కాని మాటలు ఏమైనా ఉన్నాయా? లేని మాటలు ఏమైనా ఉన్నాయా? ఉన్న స్థితిని ఆయన చెప్పే టప్పటికి అలా ఉడికిపోయారేమిటి? పైగా రాజకీయాల మీకెందుకు? అంటారా? రామాయణమేమిటి? ఆనాటి రాజకీయం కాదా? భారతం ఏమిటి, ఆనాటి రాజకీయం కాదా? జీవితాలకు దూరంగా సాధన ఎక్కడుంటుంది? ఉపదేశం ఎక్కడుంటుంది? జాతిపట్ల బాధ్యత పడి పనిచేయనివాడు ఆధ్యాత్మికవేత్త ఎలా అవుతాడు? రావణాసురుణ్ణి చంపకుండా ముక్కు మూసుకుని కూర్చుంటే రాముణ్ణి మీరు మెచ్చుతారా? రాయబారం నడపకుండా, కృష్ణుడు ఊరుకుండిపోతే మీకు నచ్చుతాడా? మరి, మనదగ్గరికి ఎప్పటికప్పుడే, ఇలా మాట్లాడవచ్చునా? జాతి యెడల బాధ్యతపడి, జాతికి, జాతిలోని నాయకులకూ దారి చూపుతున్న ఈ మహాత్ముణ్ణి, మనం ఇలా అపార్థం చేసుకోవచ్చునా? ఆలోచించండి. అందరూ కలసిఆలోచించండి చూడండి! ఇప్పుడు మీకు లేవాలనుద్దయితే లేవండి. మీ కేదయినా చెప్పాలనుద్దయితే చెప్పండి.

కూర్చునే ఉన్నారా? నా మాటలు మీకు నచ్చాయికదా! సంతోషం! నేను చెప్పదలిచింది మీకు బోధ పడిందికదా! ధన్యుణ్ణి. ఇప్పుడు ఆ మహనీ యుడు మనకిచ్చిన సందేశాన్ని మనసారా స్మరించుకుందాం. ఆయన అడుగుజాడల్లో నడచి మన జీవితాలను ధన్యంచేసుకుందాం. మీలో ఒకనిగా నన్ను స్వీకరించి, మీ హృదయాలలో నాకు చోటిచ్చి, నేను చెప్పిన అంశాలను సావధానంగా విని, కర్తవ్యోన్ముఖులైన మీకు ఇవే నా కృతజ్ఞతలు.

సభ పూర్తయింది. వేదికపైనుండి దిగి, జనంమధ్యన ఆ మండువా ఇంటి లోగిలివైపు సాగుతున్నాం. జనం వినమ్రులై నిలిచి మాకు దారి నిస్తున్నారు. చేతులు జోడిస్తూ వీడ్కోలు చెపుతున్నారు.

మేం లోగిలికి దగ్గరవుతూ ఉన్నాం. చిత్రమైన సంభాషణ ఒకటి మా చెవుల బడింది. ఆ సమయంలో. ఒక ఇద్దరు మాట్లాడుకుంటున్నారు. "ఏం కూర్చోబెట్టాడురా! జనాన్ని. అసలటూ, ఇటూ కదలనిచ్చాడా? జనం మొత్తాన్ని తన వశంలో ఉంచుకున్నాడు. మాట్లాడటం అంటే అలా ఉండాలి! అన్నాడు అందులో ఒకతను.

అతని మాటలకు స్పందిస్తూ ఆ రెండో అతను ఇలా అన్నాడు: వయస్సులో చిన్నాయన అయిపోయాడు గాని, నిజానికి ఈయనే గురువు, ఆయనే శిష్యుడు అన్నట్లుగా అనిపించిందిరా ఆ దృశ్యంతో.

మాస్టరుగారు తృప్తిగా చూశారు నావైపు. ఈ దృశ్యం కోసమే ఏ గురువైనా ఎదురుచూస్తూ ఉంటాడు."— అన్నట్లుగా.

మరికొద్ది సేపట్లో అందరం కలిసి కాలిబాటన ముందుకు సాగుతున్నాం. కొంతదూరం అలా సాగితే తప్ప వాహనాలు నిలిపిన చోటురాదు మరి. అధ్యక్షత వహించిన హెడ్మాష్టరుగారు మరో మిగిలిన గ్రామపెద్దలను తీసుకుని, అంతవరకు మమ్ముల్ని సాగనంపుదామని వస్తున్నాడు.

మాటల మధ్యలో మాష్టరుగారితో ఆయన ఇలా అన్నారు: కృష్ణస్వామిగారు, చాల చిత్రంగా గ్రామప్రజల్ని దారిలోకి తెచ్చారు. ఒకసారి ఆవేశంలోనికి వెళ్ళిన తరువాత మళ్ళీ వాళ్ళలా దిగివచ్చి, గోవుల్లా తలలు ఊపుతారని నేననుకోలేదు. తలచుకుంటే ఇది కలా? నిజమా? అనిపిస్తోంది."

చిరునవ్వునవ్వుతూ ఇలా అన్నారు మాష్టరుగారు: అందుకే అతన్ని ప్రత్యేకంగా పిలిపించడం జరిగింది. అతడి దగ్గర ఆ శక్తి ఉన్నది. నేను చెప్పదలచిన దానిని ప్రజలకు నచ్చేట్లుగా చెప్పగలగటం అది కృష్ణ స్వామి వంతు. అతను చెబితే వాళ్ళు వింటారు. దాన్ని దృష్టిలో పెట్టుకునే అతన్ని ఇప్పుడు రూపుదిద్దుతున్నది.

"దిద్దండి బాబూ! బాగా రూపు దిద్దండి. అప్పుడు భూమి ప్రజలందరూ అదృష్టవంతులౌతారు." అంటూ మురిసి పోతున్నారు హెడ్ మాష్టరుగారు.

ఆ మురిపాన్ని ముచ్చటగా చూస్తూ, ఎనలేని తృప్తిననుభవిస్తున్నారు మాష్టరుగారు.

"ఇది మన విజయ పరంపరలో ఒక ప్రధానమైన మలుపు." — అన్నట్లు ఆనందిస్తూ, ముందుకు సాగిపోతున్నారు సోదరబృందమందరూ.

8-12-00.



మనిషి నిత్య జీవితాన్ని ఎలా నియమించుకోవాలో, ఎలా
నిర్వహించుకోవాలో ఆ నిర్వహించుకోవడంలో ఎలాంటి
మెలకువలను చూపాలో, ఎలాంటి అవగాహనను కలిగి
ఉండాలో తెలియజెబుతాయి. ఈ అక్షరాల్లో అను
భూతులు. నిత్య జీవితాన్ని నియమించుకోవాలి.
నియమించుకోవడం ద్వారా దానిని పవిత్రీ
కరించుకోవాలి. పవిత్రీకరణ చెందుతున్న
జీవితాన్ని సద్వినియోగం చేయడం
ఎలాగో నేర్చుకోవాలి. సద్విని
యోగం చేయగలిగిన స్థితిలో
ఈ జీవితాన్నే ఒక యజ్ఞంగా
రూపొందించుకొని, లోక
హితాన్ని ఎలా సాధిం
చాలో నేర్చుకోవాలి.
మనిషిని చేయి
పట్టుకొని ఈ
మెట్లన్నీ ఎక్కి
స్తాయి ఈ
అక్షరాల్లో
అనుభూతులు.

ముద్రణ : విక్టరీ ప్రెస్, అబ్దుల్ ఖాదర్ వీధి, విజయవాడ–1

